

348

సాహిత్య మాసపత్రిక

# భారతి

* సోమసుందర్
* మాదిరాజు రంగారావు
* డా. టి. బి. యం. అయ్యవారు
* పోతుకూచి సాంబశివరావు
* పబ్బా శ్రీశైలం
* కడమనిట్ట రామకృష్ణన్
* డా॥ బి. వేంకటేశం
* డా॥ జి. వెంకటరత్నం
* ఎల్. సంగయ్య
* ప్రోలాప్రగడ సత్యనారాయణమూర్తి



శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, అధ్యక్షులు శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు, దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసుకు 1983-84 సంవత్సరానికి కార్యాధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకొనబడిన సందర్భాన స్రవంతి పక్షాన శుభాకాంక్షలు—




## సాహిత్య మాస పత్రిక

# 348

మార్చి-ఏప్రిల్, 1983 | సంపుటి : 30, సంచిక : 1

వార్షిక చందా : పది రూపాయిలు | విడిప్రతి : ఒక రూపాయి

*సంపాదకులు :*

డా. సి. నారాయణరెడ్డి

వేమూరి ఆంజనేయశర్మ

చిర్రావూరి సుబ్రహ్మణ్యం

# ఈ సంచికలో

# తెలుగు దేశంలో విద్యా విధానం-
# పాఠ్యక్రమ నిర్మాణం

తెలుగు దేశం పార్టీ ఆంధ్ర ప్రదేశ్‌లో అధికారంలోకి వచ్చినప్పటినుంచి క్రిందినుంచి పైదాకా చాలామార్పులు తేవాలని, తెలుగుదేశాన్ని ప్రగతి ప్రధాన ముందుకు నడిపించాలని, తెలుగు బిడ్డలకు ప్రయోజనకరమైన విద్యావిధానం ఏర్పాటు చేయాలని తపనపడుతున్నది. విద్యావిధానంలో మార్పులు, చేర్పులు, పాఠ్యక్రమనిర్మాణం, మొదలుగాగల విషయాలపై క్షుణ్ణంగా చర్చించి తెలుగుదేశం ప్రభుత్వానికి నివేదిక అందజేసేందుకు కొంత మంది ప్రము ఖులతో విద్యామంత్రి అధ్యక్షతన ఒక కమెటీ ఏర్పాటు చేయడం జరిగింది. ఆ కమెటీ చర్చించే విషయాలలో భాషా బోధనకు సంబంధించిన సమస్యకూడా ప్రధానమైనదని మా అభిప్రాయం. తెలుగుభాషకు, ఇంగ్లీషు భాషకు, తదితర విషయాలకు, ప్రాతినిధ్యం వహించగల ప్రముఖు లకు ఆ కమెటీలో స్థానం కల్పించబడిందేకానీ త్రిభాషా సూత్రంలో ఒక భాగమైన జాతీయ భాషకు ప్రాతి నిధ్యం వహించి సమన్వయాత్మకమైన సూచనలు అందజేయగల వారెవ్వరికీ ఆకమేటిలో ప్రాతినిధ్యం కల్పించబడలేదు

అఖిల భారతావనికి త్రిభాషాసూత్రాన్ని అందజేసిన గౌరవం ఆంధ్రప్రదేశ్‌కు దక్కిన విషయం యీసందర్భాన గుర్తుచేస్తున్నాం. దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసుకు ప్రథమ ఉపాధ్యక్షులుగా నున్న గౌ॥ పి.వి. నరశింహారావుగారు ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యాశాఖా మాత్యులుగా వున్నప్పుడు తెలుగుభాషా వికాసానికి, త్రిభాషాబోధనకు వారుచేసిన అద్భుత మైన కృషిని గురించి యీ సందర్భంలో పేర్కొనడం అవసరమని భావిస్తున్నాం. మహాత్మా గాంధీ గారి నాయకత్వాన భారత జాతీయ స్వాతంత్ర్య సమరంలో ఒకభాగంగా తెలుగు ప్రజలు హిందీ భాషా ప్రచారానికి పూనుకొని ఆంధ్ర ప్రదేశ్‌లో భాషాప్రచార ఉద్యమాన్ని, ఒక మహోద్యమంగా రూపొందించిన విషయం సర్వులకు విదితమే. గత 64 సంవత్సరాలుగా యీరంగంలో మహాత్మాగాంధీగారు స్వయంగా స్థాపించిన దక్షిణభారత హిందీ ప్రచార సభ ప్రత్యేకించి కృషి చేస్తున్నది. ప్రథమ స్థానం మాతృభాషకు, ద్వితీయ స్థానం జాతీయ భాషకు కల్పించడం సభలక్ష్యం. తెలుగునాట యీలక్ష్యసాధనకు 10 వేలమంది సుశిక్షితులైన

హిందీ పండితులు అకుంఠిత దీక్షతో యీరంగంలో పనిచేస్తున్నారు. తెలుగు హిందీ భాషల ప్రచార ప్రసారాలకు, ఆయా భాషా సాహిత్యా అభివృద్ధికి కృషిచేస్తున్నారు. ఇదే లక్ష్యంతో లక్షలాది స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు, ప్రతియేట సభనడిపించే హిందీ పరీక్షల్లో కూర్చుంటున్నారు. తెలుగుదేశంలో సువ్యవస్థితమైన సంస్థగా దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర పని చేస్తున్నది. విద్యారంగంలో అపారంగా కృషి చేస్తున్న యీసంస్థ అనుభవాలు తెలుసుకొని యిప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సభ సహకారం పొందవలెనని, విద్యావిధానం, పాఠ్యక్రమ నిర్మాణం మొదలుగాగల ప్రధానమైన విషయాలపై నిర్ణయం చేయుటకు ఏర్పాటు చేయబడిన కమెటీలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్రకు ప్రాతినిధ్యం కల్పించవలెనని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాం. శ్రీ జలగం వెంగళరావుగారు ముఖ్యమంత్రి గాను, శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు విద్యాశాఖా మంత్రులు గాను వున్న సమయంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర విద్యారంగంలో వారికి సహకరించిన విషయంకూడా యీ సందర్భాన జ్ఞాపకం చేస్తున్నాం. తెలుగుభాషా వికాసానికి, జాతీయ భాషా ప్రసారానికి సంబంధించిన విషయాలలో యిప్పటి తెలుగుదేశప్రభుత్వానికి కూడా - కోరిన పక్షంలో హృదయ పూర్వకంగా సహకరించగలమని మనవి చేస్తున్నాం.

శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి

ప్రత్యేక అధికారి,

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాదు.

# పంజాబీ కవితా

మూలం: జగర్ | అనుసృజనం: **డా॥ సి. నారాయణరెడ్డి**

నిప్పులరెక్కలతో ఎగిసి కొసనింగిని కుమ్ముతూవుంటాను
గహనతమస్సును చీల్చి చీల్చి నా గమ్యాన్ని చేరుకుంటాను.

పడగెత్తిన సుడిగాలి దెబ్బలకు పడిపోయినట్లు తోస్తున్నా
ముంగిట్లో ఏ చరణముద్రలో ముందే గమనిస్తుంటాను.

ఈ గోడలపై దిగిన మేకులూ ఏ స్మృతిరేఖలో తెలుపనా?
ఎవరో ఎప్పుడో చిత్రపటాలను ఇక్కడ నిలిపారంటాను.

వెలిగించి నాగుండె దివ్వెగా; నిలిపాను కన్ను గడపపై
ఇంతకుమించిన నిరీక్షణం ఇంకెవ్వరు చేస్తారంటాను.

ఒకే ఒక్క పత్రానికిద్దరం ఉన్నాము రెండుపుటలమై
వింతజీవితం; కలిసేవున్నా విడిగా ఉన్నామంటాను.

తరువులాంటి నాహృదయమే మెు అద్దంలా నిలువున పగిలెననీ
గజలును ఆమెకు వినిపించగ నా కన్నీళ్లు చూడమంటాను.

మిణుగురు వెలుగుల రంగుల తరగల కొనలు అందుకోలేకున్నా
విరహంలో నా అదృష్టరేఖలు పరీక్ష చేస్తూవుంటాను.

నేనుంటున్నది నా యింట్లోనే; ఐనా ఇది ఒక ప్రవాసమే
కాదంటారా? అయితే 'జగ్తర్' కవిని చూసి పొమ్మంటాను.

వివేకనగర్, హైదరాబాదు-20

# ఒలికిన నెత్తురు

—సోమసుందర్

నేలను ఒలికిన నెత్తుటి చుక్కలు
నింగిని వెలిగిన ఎర్రని రిక్కలు...
వీరులు విసరిన త్యాగపు రెక్కలు
తూరుపు విరిసిన జాబిలి రేకులు...

తనయుల సుఖసంతోషము చూసిన
పుడమికి పెదవులు మొలిచినచో!
దశదిశలందున మెరిసే కన్నుల
గగనము హాసము లొలికినదో!

బరువుల కణగే బడుగుల ఎడదలు
విప్లవ కేతన మెత్తేనో?
సకల వనాంతర పాదప శ్రేణులు
కలకల నాదము కురిసేనో!

స్నేహవిభవ సంయోగ కిరణ సం
కాశ పుంజముగ నసులంతా—
కరులై ఝరులై పురోగమించగ
ధరణీ గీతం విరిసేనో!

దిగంత రేఖల కొరిగిన నింగిని
చూరుల సిచికల కలకలమో!
చూడ్కులలో నవకోమల కోరక
తారాగణముల సురభిళమో!

నభమొక మౌక్తిక ఛత్రము రీతిగ
కిరణ సహస్రము కురిసేనో...

పటుతర మటనా పురుషోత్సవమున
చటుల హిమమ్ములు క్రక్కేనో?

సతంగ గళముల తరంగ నాదము
హృదంతరమ్ముల మృదంగమో!
ప్రశాంత చిత్తుల భావ ప్రభాసగ
నిశాంత కాంతుల సంగమమో!

నేటి విశీర్ణ కృశాంగుల చిత్తము
క్రోధోన్ముఖమై మెరిసే వజ్రము ...
నేటి దుర్బలుల సమైక్యజృంభణ
అసమ వ్యవస్థను తునిమే ఖడ్గము...

త్యాగనిరతితో చిరుతలు బుడతలు
విశ్వరూప సందర్శన తరుణము—
చీకటిగము రే బదాబదలుగా
పిక్కబలము చూపించే పరువము...

తనయులు మనుమల దరహాసములకు
తోరపు గొజ్జగి పూలనివాళికి
జనజీవిత సుఖసంతోషాలకు
ధరిత్రి ధుందుభులొత్తేనో!

నేలను ఒలికిన నెత్తుటి చుక్కలె
నందన వన మందారములో!...
త్యాగధనుల యెదలొలికిన నెత్తురె
జరజర పడగల నెత్తేనో!

కళాకేళినికేతన్
పిఠాపురం: 53450.

# సంగీతమే సంగీతమూ

-మాదిరాజు రంగారావు

నవ్వుతూ వచ్చు ఉదయం
ఏడ్పుతో కదలు నిశలో
పాటతో కన్నీటితో
సాగి పోయే మంచులో
సంగీతమే సంగీతమూ

పైన గాలికి ముక్కలై
తిరిగి కలిసే మబ్బులో
నవ్వు పువ్వులు రువ్వుతూ
కదలు వర్షా పదములో
సంగీతమే సంగీతమూ

పూల తరగల వాలుతో
అలల నురుగల జాలుతో
కదలు మబ్బుల మేనితో
క్రింద కదలే నదులలో
సంగీతమే సంగీతమూ

శిశువు ఎదలో ప్రసరించే
కొత్త నెతురు వాకలో
బ్రతుకు దిశలో దివ్వెయై
వెలుగు వెలిగే ప్రాణిలో
సంగీతమే సంగీతమూ

శయ్యపై నలిగి వాడిన
పూలు చూచిన వేళలో
మనసులో పుర్మ్రరించే
స్మృతుల పరిమళ లహరిలో
సంగీతమే సంగీతమూ

నిశా రూపం మాపుతూ
వెలుగు రెక్కల ఊపుతూ
సాగు ఆశా కపోతి
యాన సుందర శాంతిలో
సంగీతమే సంగీతమూ

ఎద విదల్చి మతి చిగిర్చి
కదలు వర్షా పదములో
లోని వేదన బింబమై
వెలుగు స్పందన రేఖలో
సంగీతమే సంగీతమూ.

Q. No. 14, Kakatiya University,
Warangal-506009.

# హీనోదివసాగతః

-డాక్టర్ టి. [illegible]. యం. అయ్యవారు

చేతి కందు వంద చిల్లర రాళ్ళతో
అబ్జ గర్భు పదవి నందినట్లు
లవధిలేని యట్టి ఆనంద పాథోధి
మునక వేసినాఁడ మున్ను నేను-

చుట్టములు పక్కములు, మనస్సునకు వచ్చు
నా ప్తవర్గమ్ము నతిథుల బ్యాగతులను
ప్రత్యహము గోరువాఁడఁ గీరముఖవిహగ
గణసమాగతి గోరుమాకంద మటు

చేతన్గాసులు లేక పోయిన మనస్సీమన్- సదా చంద్రికా
స్రోతస్సుల్ ప్రవహించు చుండెఁగనితారూపమున్మనన్ నాదహో!
భూతగ్రామ విధూతమైన కరణిన్ బోల్పేది కంపించునా
చేతం బెంతగ కల్మియున్నను, రసశ్రీ దూరమైనే డిటుల్.

పంచభూత ప్రపంచ నిబద్ధమైన
ఆనద మానిసి గానునే నాదినాల-
అంబుధి తరంగ ఘోషనో - అసమహాయుని
చండకిరణమ్మునో- స్మరసాయకమునో?

ఒక మధుర శబ్దమునకు, రసోజ్వల మగు
నొక్క బావమ్మునకు, పెఱయూహ లేక
బ్రతుకు దళచనె శక్ర చాపమ్మువోలె—
నిపుడు వట్టిశవమ్మనై- యిట మిగిలితి.

# ఆదిశక్తి అనంతరం

-పోతుకూచి సాంబశివరావు

ఆది శక్తి
ఆది శక్తి
శక్తికి ఆదిని కొలిచే
కొలతల వాడు కాదు
ఉన్నా కలతలే
ఆదిశక్తి
మరీ అనంతం
వికసించే పువ్వులో
చిగురించే మోడులో
అందంగా ఎదిగే కన్నెలో
ఆలాపన సంగతుల్లో
అనురాగం గతుల్లో
వెలిగే సూర్యునిలో
వర్షించే మేఘంలో
ఉన్నదే శక్తి
భిన్న మారూపాలు ॥
నవరసాలు
నవరంధ్రాలు
నవధాన్యాలు
నవమాసాలు
వేటికి సంకేతం ?
నవనవంగా
భువన మోహనంగా
కదిలేశక్తిలో
కాంతి రేఖలు
నవరాత్రాలు
నవరూపాలతో
నవ్యభవ్యంగా
నడిచివచ్చే ఆదిశక్తి
నవమాసాలు పెరిగి
నవరంధ్రాల నరసి
నవధాన్యాల ఒరిగి
నవరసాల కరిగి
నిలిచిన దనుజ శక్తిలో బీజం.
కోట్లమానవుల శక్తి బీజాలు
కోట్ల నక్షత్రాలశక్తి బిందువులు
అనంత విశ్వవలయంలో
సర్వవ్యాప్తమయి కదిలే శక్తితరంగాలు
కలిసి రూపమయినదే
ఆదిశక్తి

న్యూబోయిగుడా, సికింద్రాబాద్.

# నేను ఎవరినో తెల్సా?

-పబ్బా శ్రీశైల

నేను రమ్మంటే రాను,
వద్దంటే ఊరోక్కను,
వచ్చానంటే,
ఎవరినీ శిక్షచేయను,
ఎంతసౌఖ్యమైనా,
అందరినీ, గడగడలాడిస్తాను.
నా పేరు,
చెబితే,
ప్రతిప్రాణి
గడగడలాడుతుంది.
నా పేరు
చెబితే
పెద్ద సైజు
పెద్దలుకూడ,
జడుసుకుంటారు.
పసియైనా
రూపసియైనా,
కసితో
లాక్కెళ్తాను,
అందరినీ,
గడ గడలాడించే వాడైనా
నా పేరు చెబితే
చేతులు జోడించి
దండంపెడతాడు,
ముసలి వాడైనా,
అసలు వాడైనా,
వాళ్ళు
ప్రారంభించిన పని,
సగంలో ఆగినా!
సాంతమే సాగినా
నేను మాత్రం,
ఆగను.
వేదాంతిగాని,
సిద్ధాంతి గాని,
దమయంతిగాని,
చామంతిగాని,
మంత్రిగాని,
కంత్రిగాని,
జంత్రిచూసుకుని
మరీ వస్తాను, వారు.
ఎవరైనా వదిలి వెళ్ళను,
తీసుకుని కదిలి
మరీ వెళ్తాను.
భూమిపై వున్న
తోటివారిని
దిక్కులేకుండా
చేసి
ఓ కిక్కు యిచ్చేసి
దేవుడినే
దిక్కుగాచేసి
చిక్కుతో నింపేసి
దయ, జాలి
కనికరం, కరుణ
ఏదిలేకుండా

నేను ఎవరినో తెల్సా?

నల్లనదప
ఒండ్రపై ఠపుకెళ్తాను.
నాకు మమకారం,
లేదు.
మనుష్యులకు మాదిరి
పక్షపాతం
లేదు,
నేనుకొన్ని
సమయాలలో
డైరెక్టుగా రాను
ఇండైరెక్టుగా వస్తాను.
ముందు
ఏవ ప్రాణితో
కాటు
వేయిస్తాను.
తర్వాత
అదేకాటు
ద్వారా
వస్తాను.
వచ్చానంటే
భూమిపై
చోటు
లేకుండా చేస్తాను
మనుషుల
‘‘పజ్’’ తో పనిలేదు.
నా ‘‘ప్రిస్టేజి’’ నాకు
ముఖ్యం.

ఒక్కొక్క
సారి ఒక్కొక్కర్రినే
చేరితే ఆలస్యం,
అవుతుందని,
‘‘కాంప్లియన్స్ రిపోర్టు’’
పై
కంప్లెంటురాకుండా
తూఫాన్ రూపంలో
వస్తాను.
ఉప్పెనగా
ఉప్పొంగి మరీ,
వస్తాను.
అప్పుడందరూ
ఒకేసారి కుంగి,
నాలో లీనమై
పోతారు,
ఇంతకూ,
నేనెవ్వరో
తెలుసుకున్నారా ॥నేనే॥
దేవతని
మృత్యుదేవతని
లెక్క ప్రకారమే,
నాపని
నాపేరు,
చెప్పితే,
కంపిస్తుంది.
అవని.

H. No. 4-2-64/1
హన్మకొండ 506001.

మలయాళ కవిత :

# వాళ్ళంటారు

-కడమనిట్ట రామకృష్ణన్

ఈగదిలో, ఈరాత్రి, ఈమసక చీకట్లో
ఈబల్ల చుట్టూ కూచొని సమస్యల్ని పరిష్క
రించొచ్చునని
**వాళ్ళం**టారు.
నల్లపిల్లి పంజాలు నాకుకొని
కళ్ళుమూసుకొని బల్లమీద కూచుంటుంది.
ఈబల్లమీద ఒకభాగ్ అమూల్ డబ్బా, వెక్కి
వెక్కి ఏడుస్తున్న పాలసీసాలు,
తీక్షణంగా చూస్తున్న నిశ్శబ్ద నేత్రాల జత-
ఈబల్లమీద
మృతకళేబరాల మాంసం తినే చీమలు
చెల్లాచెదరైన రొట్టెతునకల మీద తిరుగు
తుంటాయి.
ఈబల్లచుట్టూ కూచుని సమస్యలన్నీ పరిష్క
రించొచ్చునని **వాళ్ళం**టారు.
స్పీకరు మాట్లాడుతూనే వుంటాడు.
మిగిలిన **వాళ్ళు** కళ్ళద్దాలు తుడుచుకొని
బల్లమీద పెడతారు-
జాగ్రత్తగా నిద్రలో మునుగుతారు
గురక ఉపన్యాసానికి లయ కలుపుతుంది.
ఆకస్మిక ప్రశంస గోడను ఢీకొని
చెల్లాచెదరవుతుంది.
పాచి పోయిన పరిహాసాలకు పళ్ళు చిర్న
వ్వులు చిందిస్తాయి-
చెరుమాళ్ళ పళ్ళను రహస్యంగా మూసే
స్తాయి-
ముఖాన్ని తుడిచేస్తాయి.
మృతకళేబరాల మాంసం తినే చీమలు
వెక్కి వెక్కి ఏడుస్తున్న పాలసీసాల మీద
ఇంకా పైకెక్కుతాయి.
ఈబల్లచుట్టూ కూచొని సమస్యలన్నీ పరిష్క
రించొచ్చునని
**వాళ్ళం**టారు.
**వాళ్ళు**
నా సస్యశ్యామల భూమిని
ఒక ఉట్టి పటంగా మార్చి బల్లమీద పరుస్తారు.
**వాళ్ళు**
నాతల్లి సుఫలను
పీల్చి పిప్పిచేశారు,
బల్లకు మొలలతో కొట్టగలిగిన
గోళంగా మార్చారు.
పెన్సిల్ గుర్తులు, బాణాల కొసలు, విపరీత
మైన కోర్కెలు
ఆమెను పగల గొట్టాయి.
అవయవాల కోసం పోట్లాటలు
ఆమెను నిస్సహాయను చేశాయి.
**వాళ్ళా**మెను కోలింగ్ ట్రోఫీలా పట్టుకుం
టారు

ప్రేమ లేదు, ఐకమత్యం లేదు,
గురుత్వాకర్షణశక్తి కూడా తగ్గిపోయింది.
స్పీకర్ మాట్లాడుతూనే వుంటాడు
బల్లమీద గురకల నీడలు సంధిగ్ధంలో పడతాయి.
ఈ బల్ల చుట్టు కూచొని సమస్యలన్నీ పరిష్కరించొచ్చునని
వాళ్ళంటారు.
బతుకు ఊపిరి బూడిదై కింద తేలుతుంది.
ప్రేమ మాడి మసైన మొండాలుగా మారుతుంది.
చూపు ఇంకా పుట్టవలసే వుంది.
తూగుతున్న తలల మీద
నెత్తుటి వర్షం వడి వడిగా పడుతుంది.
మృత్యువుకు మారుపేరైనా రాక్షస ఎండ్రకాయలు
బల్లను, పటాన్ని పొడుస్తాయి,
భూగోళం మీదికెక్కి
నగ్నంగా నర్తిస్తూ జత కలుపుకుంటాయి.
పిల్లి చిర్నవ్వు నవ్వుతుంది.
పాలసీసాలు వెక్కి వెక్కి ఏడుస్తున్న శబ్దాలు
ఆగిపోతాయి.
తీక్షణంగా చూస్తున్న నిశ్శబ్ద నేత్రాల జత
ఎర్రనవుతుంది.
స్పీకర్ మాట్లాడుతూనే వుంటాడు
గురకలయ వేగవంత మవుతుంది
ఈబల్లచుట్టు కూచుని సమస్యలన్నీ పరిష్కరించొచ్చునని
వాళ్ళంటారు.
వాళ్ళ నిర్ణయం కోసం ఎదురుచూస్తూ
తలుపు దగ్గర నిలబడ్డ నాకనుబొమలు
రాలిపోవడం ప్రారంభమవుతుంది.
కంటిపాపలు తెల్లనవుతాయి.

వాట్లో బాణాలు గుచ్చుకుంటాయి.
నాతలమీద కందిరీగలు జమకూడుతాయి.
నాకాలి వేళ్ళమధ్య ముళ్ళచెట్లు పెరుగుతాయి
గుండెలో సహారా నిండుతుంది.
ఒంటె, యాత్రికులూ ఇసుక కొండల్లో అదృశ్యమవుతారు.
గిరగిర తిరిగే కాలచక్రం
అరుస్తూ ఇసుక తుపానుల్లో పడిపోతుంది.
ఇసుక ప్రతి ప్రవాహాన్ని తాగేస్తోంది.
నాముందొక నోరు తెరుచుకుంటుంది.
తల్లికోసం ఏడుస్తూ ఊపిరి పోగొట్టుకొన్న
శిశువు వెడల్పైన నోరది!
కరిగిన భూహృదయం
ఆనోటినుంచి
శోకంగా ప్రవహించడం ప్రారంభమవుతుంది.
సముద్రాలు మసలడం ప్రారంభమవుతుంది.
కనుబొమలు వికసిస్తాయి
కంటిపాపలు నల్లనవుతాయి.
గుండ్రటి బల్లలు పడిపోతాయి
గుండ్రటి బల్లలను గట్టిగాపట్టుకొన్న చేతులు విడిపోతాయి.
నల్లపిల్లి కనబడని మచ్చగా మారుతుంది.
నాకళ్ళను పొడుస్తున్న
బాణాలు చూపులవుతాయి.
నాభూమి బంధనాలు విడివడి
కదలబారడం నాకు కనిపిస్తుంది.
ఇంకా
బల్లచుట్టు కూచొని సమస్యలన్నీ పరిష్కరించొచ్చుననే
వాళ్ళంటారు.

మలయాళంనుంచిఇంగ్లీషు: సచ్చిదానందన్
ఇంగ్లీషునుంచి: వేణు

# సాహిత్యసృష్టి  ప్లేటో దృష్టి

డా॥ బి. వేంకటేశం

సాహిత్య మొక అపూర్వ సృష్టి యనియు, తన్నిర్మాత ప్రజాపతి సముడనియు భారతీయులు కొనియాడినట్లే పాశ్చాత్యులు సైతము కీర్తించిరి. భాష వెనుక వ్యాకరణ ముదయించి భాషను శాసించిన విధమున సాహిత్య సృజనానంతరము తత్ శాస్త్ర మావిర్భవించి సాహిత్యమును శాసింప మొదలిడెను. భాష యందలి వివిధ భాగముల సూత్రీకరణము వ్యాకరణమైనట్లు, సాహిత్య వివిధాంగములు సాహిత్య శాస్త్రముగా అవతరించినవి. భారత దేశమునందు ఈ శాస్త్ర వికసనము శబ్దార్థపరముగా జరుగగా, పాశ్చాత్య దేశములందు సాహిత్య నిర్మాత యొక్క వ్యక్తిత్వ పరముగా వికసించినది. కావున భారతీయ శాస్త్రమునందు కళా తత్త్వ మధిగమింప పాశ్చాత్య సాహిత్య శాస్త్రమునందు వస్తుతత్త్వ మధిగమించినది. అనగా ఒకటి సాహిత్య మహిమాశయనిరూపణము నందు వికసింప మరియొకటి సాహిత్య నిర్మాత యొక్క ఉదాత్త వ్యక్తిత్వ నిరూపణమునందు వికసించినది. హోమర్, పిండార్, యురిపిడస్ మున్నగు గ్రీకు రచయితల రచనల యందు పాశ్చాత్య సాహిత్యశాస్త్ర బీజములు గోచరించినను ప్లేటో యొక్క వివిధ రచనల యందు మాత్రమే విస్పష్టముగా సాహిత్యమును గురించిన శాస్త్రీయతా దృక్పథము కానవచ్చును. ఈ మహానుభావుడు కవిదూషణతో సాహిత్య శాస్త్ర వికాసమునకు నాంది ప్రస్తావనల పఠించి మూలస్థానీయుడై వెలసెను. భారతీయ సాహిత్య శాస్త్రము కవిస్తుతితో ఆవిర్భవింప, పాశ్చాత్య సాహిత్య శాస్త్రము కవి నిందతో ప్రారంభమయ్యెను. ఇది విచిత్రముగా తోచును,

పాశ్చాత్య సభ్యతకును, సంస్కృతికిని మూల పురుషులు ముప్వురు. వారలు సోక్రటీస్, ప్లేటో మరియు అరిస్టాటిల్. వీరు క్రమముగా గురుశిష్యులు, పాశ్చాత్య దేశములందు వ్యాపించిన వివిధ సిద్ధాంతములన్నింటికి యీ గూరు-శిష్య పరంపరగా వెలిసిన ఆలోచనా సరణియే మాతృక. గురువైన సోక్రటీస్ దివ్య సందేశములను తన రచనలయందు పొసంగించి, అతనిని శాశ్వత మూర్తిగా తీర్చి దిద్దిన మహామేధావి ప్లేటో. సోక్రటీస్‌ను బలిగొనిన ఏథెన్స్‌నగర శాసనమును నిరసించి లోక కళ్యాణార్థము సంపూర్ణ జీవితమును ధారపోసిన దీక్షాపరుడు ప్లేటో. ఆయన ధర్మ రాజ్య సంస్థాపనార్థము వివిధ శాస్త్రములను సంస్కరించెను. దూషిత సాహిత్యమును నిరసించి సాహిత్య శాస్త్రమునకు చక్కని రాచబాటల వైచెను.

కటు స్పర్శలేని ఔషధము నిరుపయోగమైనట్లు, దార్శనిరచింతనా యుక్తములు కాని శాస్త్రములు-కళలు ప్రయోజనరహితములే కాదు, ప్రమాదకరములునై సమగ్ర మానవ జీవితము నధోగతిపాలు కావించును. దార్శనిక చింతన వల్ల మానసిక శాంతి, తద్వారా నైతికత పెంపొందును. నానాభావ సమన్వితమైన ఈజగత్తునందుతనశీల నిర్మాణమువలన పాత్రయొక్క విలువ మానవునకు అవగతము కాగలదు. కనుక నీతి యుక్తమైన జీవితమే జీవన సార్వభౌమత్వమునకు ప్రాతి పదిక. అది లోపించిన నాడు సమగ్ర మానవ జీవితమునకు ముప్పు వాటిల్లక తప్పదు. కావున దార్శనిక చింతన కేవలము వేదాంతికే కాదు, కవులకును, కళాకారులకును, మరియు రాజకీయ నాయకులకును

కూడా అనివార్యమగుచున్నది. ఈ దృష్టిలో ప్లేటో తన కాలమునందు ప్రచారములో నున్న అధికాంశ సాహిత్యమును నిషేధించెను కావున ప్లేటో యొక్క సాహిత్య దృక్పథమునకు అతని దార్శనిక చింతన మూల ప్రాతిపదిక.

ప్లేటో గొప్ప తాత్త్వికుడు అతని వంటి మహా మేధావి మరి యొక రిపపంచమున జన్మించలేదని మెకాలే, కీర్తించెను. ప్లేటో సమగ్ర విశ్వమును రెండుగా విభజించెను. 1. ఆధ్యాత్మిక జగత్తు (The World of Ideas) 2. భౌతిక జగత్తు (The world of matter or Nature). ఇందు మొదటిది. సత్యము. రెండవది మొదటి దానికి ప్రతి రూపము (copy) ఇట్లు ఆధ్యాత్మిక జగత్తు సత్యము కాగా, భౌతిక జగత్తు అసత్యమగుచున్నది. ఈ జగత్తు మిథ్య యనుటకు పరమ ప్రమాణము ఇది శాశ్వతము కాక పోవుటయే. మానవ జీవితము ఈ రెండింటి ప్రభావములకు పరిణామము. ఇది అశాశ్వతమైన దేహము నంటిపెట్టికొని యున్నను, శాశ్వతమైన ఆత్మనుండి మాత్రము బాహిరముకాలేదు. మిథ్యాలోక ప్రభావమున జీవితమునకు దూషితమగుట కెంత అవకాశము కలదో అంతే అవకాశము జీవితమును ఆదర్శ ప్రాయముగా తీర్చి దిద్దుటలో ఆత్మకు కలదు. శీలనిర్మాణముదార్శనికస్పర్శవినాఅసంభవము. కావున మానవ మనుగడ సత్యలోకాభిముఖమై యుండ వలయును. ఈ ఆదర్శజీవితము అసంభవ మనుటకు వలను పడదు. ఏలన ఆత్మ స్వయముగా సత్యము. ఇట్లు ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నమై యుండుటయే మానవ జీవితమునకు ప్రధాన లక్షణము. అపుడే సాంఘిక భద్రత చేకూరును. ధర్మరాజ్యము స్థాపింప బడును, ప్రజానీకమును పాలించు రాజకీయ నాయకులకును మరియు వారి యందు భావ్యపరి వర్తనమును కల్గించు కళాకారులకును ఈ జ్ఞానము పరమావశ్యకము. ఇట్లు ప్లేటో ఆధ్యాత్మికశక్తిని "ఐడియా" (Idea)గా పేర్కొని దాని కనుగుణముగా దార్శనిక సిద్ధాంతములను ప్రతిపాదించెను అందువలన ఆయన 'ఐడియలిజమ్' (ఆదర్శవాదము)నకు ప్రవర్తకుడయ్యెను. భారతీయ అద్వైతవాదుల వలె ప్లేటో నిర్గుణ బ్రహ్మ నుపాసించిన తాత్త్వికుడు.

ప్లేటో ప్రత్యేకముగా కావ్యశాస్త్రమును రచింపలేదు. అతని వివిధ రచనల యందు. రిపబ్లిక్, లాస్, స్టేట్‌మన్, సింపోజియమ్, అయోన్ మున్నగునవి, అతడు సాహిత్యమును నిషేధించిన తీరును బట్టి మాత్రమే అతని సాహిత్య దృక్పథమును గ్రహింపగలము. తద్వారా ఈ తాత్త్వికుని సాహిత్య వివేచన భావి పాశ్చాత్య సాహిత్య శాస్త్రమున కెట్లు తోడ్పడినదో అవగతము కాగలదు.

ప్లేటో సాహిత్య స్వరూపము నిట్లు విశదీకరించెను. సంగీతము, చిత్రలేఖనము, శిల్పమువలె సాహిత్యము కూడా ఒక కళ. కళాకారుడు కళాసృజన కావశ్యకమగు వస్తువును, మరి యితర సామగ్రిని ఈ మిథ్యా జగత్తు నుండి గ్రహించును. సాహిత్యకారుడు సైతము వారి మార్గమునే అనుసరించును. ఈ వస్తుగ్రహణమునకు మూలాధారము మానవునిలో నెలకొనియున్న అనుకరణాత్మక ప్రవృత్తి (Imitative instinct) కళాకారుడు అనుకరణము ద్వారా ప్రకృతి నుండి కళాసృజన కావశ్యకమగు వస్తువును గ్రహించుట వలన ప్రకృతి అతనికి అనుకార్యము కాగా అతని అనుకరణమునకు పరిణామము కళ యగుచున్నది. ఈ దృష్టిలో కళలు ఎట్టి స్థాయికి చెంది యున్నవో మనము సులభముగా గ్రహింప వచ్చును. కళాకారుని అనుకార్యమైన ప్రకృతి లేదా ఈ జగత్తు స్వయముగా సత్యము కానేరక సత్యమునకు ప్రతిరూపమగుచున్నది. ఈ అసత్యమైన జగత్తు నుండియే కళాకారుడు కళావస్తువును గ్రహించుట వలన ఆ వస్తువు కూడా అసత్యమే యగుచున్నది. అంతేకాక కళాకారుడు ఆ అసత్య వస్తువును ఉన్నదియున్నట్లుగా ప్రదర్శింపక తన భావన కనుగుణగా దానిని మల

చును; మరోరూపమున దానిని ప్రదర్శించును. ఈవిధముగా కళాజగత్తు సత్యము నుండి మూడవభూమిక దూరీకృత మగుచున్నది. ఈ ప్రకృతి మొదటి అసత్యము; దాని ననుసరించుట రెండవ అసత్యము; మరియు దానికి మరో రూపమును ప్రసాదించుట మూడవ అసత్యము. కావున కళ ఆధ్యాత్మిక సత్యమును ప్రదర్శింప జాలకున్నది.

ప్లేటో సాహిత్య ప్రేరణ నిట్లు వివరించెను. ప్రతి కార్యము ఆ కార్యకర్త యొక్క సమునిత ఆవేశముపై ఆధారితమై యుండును. సాహిత్య స్రష్టలైన కవులు, నాటక కర్తలు మున్నగు వారి యందట్టి సముచితమైన ఆవేశము కానరాదు. వారు ఈ మిథ్యా జగత్తును అనుకరించుచు ఒకానొక సన్నివేశమునకు వశీభూతులై గంభీరచింతన నుపేక్షించి కళాసృజనకు కడంగెదరు. సమర్థవంతమును, ఉదాత్తరమును మరియు ఆధ్యాత్మిక జ్ఞాన యుక్తము కాని ప్రేరణ నుండి ఉదాత్త కార్యము నపేక్షించుట హాస్యాస్పదము మహనీయ కార్యము మహత్తరమైన సత్యమును ప్రబోధించు క్షమతను కలిగియుండి తన సార్థక్యమును నిరూపించుకొనును. సాహిత్యమున కట్టి సామర్థ్యము లేదు. కారణము స్పష్టము. అసత్యమే దీనికి ఆధారభూమి. సత్యమును ప్రబోధించు సమర్థత ఇక సాహిత్యమున కెక్కడి నుండి వచ్చును? సత్యమును ప్రదర్శించ కున్నను ఒక దృష్టిలో మేలే యని భావించినను భావింప వచ్చును. కాని సాహిత్యము అంతటితో ఆగక "దుష్టులు. తమ దుష్కార్యమును గుప్తములుగా నున్నంత కాలము భోగ భాగ్యములతో తులతూగు చుండగా. సజ్జనులు తమ సత్ప్రవర్తనచే అన్యులకు హితమును చేకూర్చి తమ వినాశమునకు తామే కారకులగుచున్నారు. —They give us to understand that many evil livers are happy and many rightous men unhappy, and that wrong doing, if it be undetected, is profitable, while honest dealing is beneficial to one's nighbour, but damaging to one's self"— అను శీలమునకు భంగమును కల్గించు నీతిని బోధించును. కావున సాహిత్య జగత్తు నుండి సత్యము నాశించుట అవివేకము. ఆధ్యాత్మిక సత్యముతో సాహిత్య సత్యమును పోల్చి చూచినచో సాహిత్య సత్యమెంత హీనతరమో స్పష్టము కాక తప్పదు. కనుక సాహిత్యము మరియు దర్శనము. యివి రెండును ఏనాడును ఒకే మార్గమున పయనించలేవు. వాని మధ్య అనాది నుండి పోరాటము కొనసాగుచునే యున్నది. There is an ancient quarrel between Philosophy and Poetry.

ప్లేటో సాహిత్య ప్రయోజనా రాహిత్యము నిట్లు నిరూపించెను. సాహిత్యకారులు నీతి నణగద్రొక్క జాలక దేశమునందు పుష్కలముగ భ్రష్టాచారమును ప్రోత్సహించెదరు. హోమర్ మహాకావ్యములు, పిండార్ గేయకావ్యములు, ఎస్కైలెస్, సోఫోక్లెస్ మరియు యురిపిడస్ నాటకములు దేశమున కెట్టి ప్రయోజనమును చేకూర్చ లేక పోయినవి. హోమర్ మొదట వాగ్దేవిని స్తుతించి దివ్య పురుషచరితను రచింప సమకట్టెను. కాని తరువాత ఆయన తనకు తోచినట్లు వర్ణించి యితరులకు అసత్య నిరూపణము ద్వారా కళానైపుణ్య ప్రభావము యొక్కరుచి యెట్టిదో చవి చూపించెను. కవి తన మంత్ర శక్తితో పదముల కొక విధమైన సొగసును కల్పించును. తద్వారా సామాజికులను తన వశవర్తులుగా నొనర్చుకొని మిథ్యా జగత్తుకు సంబంధించిన అంశములనే నానారకములను వర్ణించి చెప్పును. అంతేకాక కవి ఒకే వస్తువు నొక విధముగ, అదే వస్తువును మరొకసారి మరొక విధముగ వర్ణించి సామాజిక చిత్త సంక్షోభమునకు మూల కారకు డగుచున్నాడు. అసలు కవిత్వ మహత్వమంతయు అది సామాజికునిలో కల్గించు భావోద్వేలన ప్రక్రియపై ఆధారపడి యున్నది. వాస్తవముగ భావములను నిగ్రహించుకొనుటలోనే మానవుని గొప్పతన

మిమిది యున్నది. కాని సాహిత్యము ఈ మార్గమున సఫలీకృతము కాజాలకున్నది. కనుక అనుకరణాత్మక మైన సాహిత్యము నిషేధాత్మకము.

ప్లేటో యొక్క సాహిత్య నిషేధము నందలి ప్రధానాంశము అవి—

1. అనుకార్యము (ప్రకృతి) మరియు అనుకృతి (సాహిత్యము) రెండును అసత్యములు. తాననుకరించు విషయము సత్యమా? అసత్యమా? యను విచక్షణా జ్ఞానము సాహిత్యకారునకు లేదు.

2. సాహిత్య కారు డెల్ల వేళల హీనతర భావములనే అనుకరించును. ఉదాత్త భావములను కాదు, కారణము ఆతనికి అట్టి ఆవేశము లేదు.

3. సాహిత్యము నిగ్రహింపదగిన భావములను పోషించి, సంయమన శక్తిని పెంపొందించుచు, మానవ శ్రేయస్సు నాపాదించు ఆనందమును ప్రసాదించుటకు బదులు ఆ భావములకే ఉద్రేకమును కల్గించును, మానవుని శీలమును చెరపును.

ప్లేటో, సాహిత్యమును తీవ్రముగ విమర్శించినను, సాహిత్య మహత్త్వము నుండి మాత్రము సంపూర్ణముగా అపరిచితుడు మాత్రముకాదు. ఆ మహనీయ ప్రతిభ సాహిత్యము నిట్లు ప్రశంసించెను. "ఐనను మహత్తరమైన ఆధ్యాత్మిక జ్ఞానమును ప్రబోధించు దేవతా స్తోత్రములు మరియు దివ్యపురుష చరితలను వివరించు ప్రశంసాత్మక సాహిత్యము ధర్మరాజ్యము నందభినందనీయమే యగును. Plato had a fine aesthetic sense. He was tender at heart to wards art. He himself declared in his republic (Book X) that he would have been very glad to jastify art to prove its rationality and to give it a place in the ideal Republic if Some one could tell how

అని డాక్టర్ కాంతిచంద్ పాండేగారి యభిప్రాయము. ప్లేటో సాహిత్యకారు నిట్లు ప్రశంసించెను. "అతడొక దివ్యకాంతి పుంజము దివ్య ప్రతిభ, వాగ్దేవత ఆతని నావేశించును. తన వశమందుంచుకొని ఆతనిచే సాహిత్యమును రచింప జేయును. ఇట్టి విక్షిప్తతావస్థను సాహిత్యకారుడు పొందియుండవలయును. లేనిచో ఆతడు ప్రతిభాహీనుడై రచనా వ్యాసంగము నందు సఫలుడగును. For the poet is a light and winged holy thing. and there is no iuvention in him untill he has been inspired and is out of his senses and the mind is no longer in him when he has not attained to this state, he is power less and unable to utter his oraclas".

కావున సాహిత్యమును గురించిన దురభిప్రాయము ఈ జగద్విఖ్యాత తాత్త్వికునకు లేదనుట నిజము. సమకాలీన దూషిత సాహిత్య ప్రభావమున దిగజారి పోవుచున్న సాంఘిక జీవన స్థితిని గ్రహించి వికలితమైన ఆతని కవి హృదయము ఈ నిషేధాత్మక సాహిత్య విమర్శకు దారి తీసిన దనుటలో సందేహము లేదు. అట్లు కాని యెడల ఆయన సాహిత్యమును ప్రశంసించుటలో ఆస్కారమే లేదు. కావున సాహిత్య సృజనయందు ప్లేటో దృష్టి తత్కాలిక సాహిత్య-కారుల దృక్పథము కన్న భిన్నముగా నుండెనని గ్రహింపవచ్చును. ఆయన మొదట సాహిత్యకారుడు. తత్కాలీన దూషిత సాహిత్యమునకు ఆమహానుభావుడు సిగ్గుపడి తన రచనల నన్నింటిని నష్టము కావించెనని లోక వాడుక.

సాహిత్యకారుడు సత్యమైన అధ్యాత్మిక జగత్తు ననుకరింపక అసత్యమైన మన కనులకు గోచరమగు చున్న ప్రకృతి ననుకరించును కనుక ఆతని రచనకు మూలాధార విషయము అసత్యము కాగా సాహిత్యము

సత్యము కాదని ప్లేటో తేల్చివై చెను. ఐనను దేవతా స్తోత్రములు, దివ్య పురుష చరితములు మరియు విషాదరూపకములు అతని దృష్టియందు అభినంద నీయములే. ఐనపుడు ప్లేటో భావించిన సాహిత్య స్వరూపమేమి? అది పైన పేర్కొనబడిన విషాద రూపకాదుల తెగలకు చెంది యుండనేరదా? మరియు విషాదరూపకాదులనే సాహిత్యముగా భావించియుండెనా? యను ప్రశ్నలు తలయెత్తుట సహజము. ప్లేటో దృష్టి యందు భావోద్వేగలనను కల్గించు రచనలు అన్నియు సాహిత్య జగత్తునకు సంబంధించినవే. కాని ఆయన దేశహితైక దృష్టితో ఉదాత్త భావసంపన్నములైన విషాదరూపకాదులను వేరుపరచి దానిని సాహిత్యముగా పరిగణించెను. కారణమేమన ఈ సాహిత్యము ద్వారా సామాజికుడు ఆధ్యాత్మిక సత్యము వైపు పురోగ మించును. మానవ జీవితమును మానవ జీవితము గనే నిలుపుకొన యత్నించునే కాని పశు తుల్య జీవిత ముగా అది పరిణమించు అవకాశమునుదరిజేరనీయదు. ఇట్టి ఉదాత్తాశయముతో ప్రేరితమై, రచితమైనదే సాహిత్యమని అతని భావము. కనుక సాహిత్యమునకు అధ్యాత్మిక సత్యము ఆధారభూమి కావలయును. ఇది మహత్తరమైన కార్యము. దీని సిద్ధి సాహిత్యకారుడు దివ్యావేశ సంభూతుడు కానిదే జరుగనేరదు. దివ్యా వేశమే సాహిత్యకారునకు నిజమైన సాహిత్య ప్రేరణ, ఈ విషయమును 'అయోన్' అను గ్రంథమునందు అయోన్ మరియు సోక్రటీస్‌ల సంవాదము ద్వారా ప్లేటో చక్కగా నిరూపించెను. అయోన్, సోక్రటీస్ జీవనకాలము నందలి సుప్రసిద్ధ గ్రీకు కళాకారుడు. తాను హోమర్ కావ్యముల నభినయాత్మకముగా గానము చేయునపుడు ఇంద్రియజ్ఞాన విస్మృతిని చెందెదనని అయోన్ తెలుపును. ఈ విస్మృతి రచయిత, వ్యాఖ్యాత మరియు సామాజికుడు—ఈ ముగ్గురి యందు అనుస్యూతముగా వెలసి యుండుననియు, ఒకానొక దివ్యశక్తి వారల నావేశించి వారి మానసము లను కదలించి వేయుననియు సోక్రటీస్ విశదీ రించును —The gift which you posess... is not art. But as I was just saying an inspiration, there is a divinity moring you. కనుక సాహిత్యసృజనకు పూర్వము సాహిత్యకారుడు దివ్యావేశ సంపన్నుడు (Divine-madness) కావలయును. తద్వారా అతడు స్వీయేం ద్రియజ్ఞాన విస్మృతు (out of senses) డగును. ఆ దశయందు మాత్రమే అతడు రచనను సలుప గలడు. ఇది యోగుల యోగసాధన వంటిది. విశ్వ రహస్యమును గూర్చి మరియు మానవజీవితమునకు దానితో గల సంబంధమును గూర్చి గంభీరముగా చింతించనిదే ఇట్టి దశ మానవునకు కలుగ నేరదు. అందువలన సాహిత్య వస్తువు, ప్రేరణ మరియు రచన-యివి యన్నియు అధ్యాత్మిక జ్ఞానయుక్తములు కావలయును. రచన యందు రచయిత యొక్క దివ్యావేశము అనుస్యూతముగా వెలసి యుండ వలయును. అపుడే సార్వభౌమిక సత్యమును సాహి త్యము వ్యంజింపగలదు, తత్స్ఫురణ కలిగిన కొలది సామాజికుడు స్వార్థ-మోహముల నుండి విముక్తుడై ఇంద్రియాతీతమైన ఆనందము ననుభవింపగలడు. ఆ ఆనంద మొక గంభీరమైన మహాసముద్రము వంటిది. ఆ ఆనందానుభవము వలన ప్రేమ సము ద్భూతమై సౌందర్యాత్మకమైన విశ్వాత్మ సందర్శన మునకై పురోగమించును. కనుక సాహిత్య ప్రయో జనము ఇంద్రియ పరితోష మాత్రము కారాదు. సాహిత్యము మాటల గారడి చేయుట కాదు. ఇంద్ర జాలిక విద్య కాదు. అజ్ఞాన వశవర్తులై పశుతుల్య జీవనమునందు రమించుచున్న మానవులకు దివ్యజ్ఞాన మును ప్రబోధించివారితో ఆత్మ జ్యోతిని వెలిగిం చుటయే నిజమైన సాహిత్య ప్రయోజనము . అది శబ్దబ్రహ్మానుపాలింపగా బయలు పడిన అమృత కలశము. ఇట్టి ఉదాత్త సాహిత్యముద్వారా ధర్మరాజ్య స్థాపన మందలి అవరోధములు తొలగి పోవును. సాంఘిక భద్రత చేకూరును, మరియు సమగ్ర మానవ

జీవితపు సుఖశాంతులకు నిలయము కాగా సంస్కృతి

ప్లేటో దృష్టియందు సాహిత్య సృష్టి సామాన్యము కానేరదు. అది విశ్వరహస్య పరిశోధనము, దివ్య ప్రతిభాజనితము మరియు దివ్య ప్రేరణాభరితము. కాని సాహిత్యము తన భవ్యమైన స్థితి నుండి దిగజారి పోయినప్పుడు తద్రక్షణార్థము నిషేధాత్మక విమర్శ రాక తప్పదు. ప్లేటో అట్లే చేసెను. ఇట్టి విమర్శ భారతీయులకు క్రొత్తయేమి కాదు. నాస్పృశేత్ కురుతే కావ్యం యని మన ప్రాచీనులు సిద్ధాంతము చేసిరి. జావ్యాలాపాంశ్చ వర్జయేత్, యని దూషిత సాహిత్యమును నిషేధించిరి. ఈ నిషేధాత్మక సాహిత్య విమర్శనే ప్రాతిపదికగా గ్రహించి ప్లేటో శిష్యుడైన అరిస్టాటిల్ కావ్యశాస్త్రమును రచించి ప్రథమ పాశ్చాత్య సాహిత్య శాస్త్ర రచయితగా ప్రసిద్ధి నొందెను

## ఉపయుక్త గ్రంథసూచి

1. Allan A Gulget — Plate to Dryden
2. Darid Daiches — Critical Approaches
3. K. C. Pandey — Comparative Aesteotics Vol. II.
4. Wimsatt Books — Critiasm a short History
5. जगेंद्र — पाश्चात्य काव्य शास्त्र की परंपरा
6. गणपतिचंद्र गुप्त — भारतीय एवं पाश्चात्य काव्य सिद्धांत
7. లక్ష్మీకాంతం — సాహిత్య శిల్ప సమీక్ష
8. బి. వేంకటేశ్వర — భారతీయ-పాశ్చాత్య సాహిత్య దర్శనము.

# తెలుగులో విజ్ఞాన సర్వస్వములు

డా॥ జి. వెంకటరత్నం

ప్రపంచ ప్రఖ్యాతి గన్న ఎన్‌సైక్లోపెడియా బ్రిటానికా, ఎన్‌సైక్లోపెడియా అమెరికానా మొదలైనవి ప్రపంచ విజ్ఞానాన్ని ప్రమాణ పూర్వకంగా గ్రహించి అకారాది క్రమంలో రచింపబడిన చక్కని విజ్ఞాన సర్వస్వాలు. ఇవి అనంతమైన ఈ కాల ప్రవాహంలో, వివిధ దశల నధిగమించి, ఎన్నెన్నో మార్పులను బొంది సర్వాంగ సుందరంగా వెలువడ్డ గ్రంథ రాజములు. ఇటువంటి వానికై నేడు అన్ని దేశాలందును, అన్ని భాషలందును కృషి జరుగుచున్నది.

తెలుగులోను వివిధ తీరుల విజ్ఞాన సర్వస్వాలు వెలిసియున్నది. అందులో శ్రీ కొమర్రాజు లక్ష్మణ రావుగారి అధ్వర్యంలో 1916లో ప్రారంభింపబడిన "ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము" మొట్టమొదట చెప్పుకోదగింది. ప్రజ్ఞావంతులైన అనేకుల రచన లిందుచోటు చేసుకొన్నది. అకారాది క్రమంలో రచింపబడిన ఈ విజ్ఞాన సర్వస్వాలు ప్రపంచ విజ్ఞానాన్ని సమీకరించుటకు ప్రయత్నం చేసినదే. కాని వీని రచన పూర్తిగా సాగలేదు మూడు సంపుటాలు మాత్రమే వెలువడి కారణాంతరాల వలన ఆగిపోయినవి. తెలుగులో వీని తర్వాత వచ్చిన విజ్ఞాన సర్వస్వం 1938లో శ్రీ ప్రసాద భూపాలుడు రచించిన "ఆంధ్ర విజ్ఞానము". ఇది ప్రసాద భూపాలుడొక్కడే రచించిన గ్రంథం కాబట్టి దీనిని వ్యక్తి ప్రజ్ఞాధీనమైన విజ్ఞాన సర్వస్వంగా పేర్కొనవచ్చును. ఇది చాల సంక్షిప్తంగా వ్రాయబడిన విజ్ఞాన సర్వస్వం. సాహిత్యం, సంగీతం మొదలైన కళలు, శాస్త్రాలు మొదలైన విషయాలందు వివరించబడినను, సైన్సు; టెక్నాలజీ మొదలైన వానికంత ప్రాముఖ్య మిచ్చినట్లు కనుపించదు. మొత్తం మీద ఇది సంపూర్ణమైన విజ్ఞాన సర్వస్వంగా చెప్పుటకు అవకాశాలు తక్కువ. తరువాత వచ్చినవి శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి అధ్వర్యంలో వెలువడిన సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు. ఇది వ్యక్తి ప్రజ్ఞాధీనమైనవిగాక ప్రజ్ఞావంతులైన అనేకుల రచనలతో కూడి యున్నవి. విషయ సమీకరణంలోను, విపులీకరణంలోను సంక్షిప్తతను పాటించి యుండుటచే వీనిని కూడా ఉన్నత స్థాయి విజ్ఞాన సర్వస్వాలలో చేర్చుటకు అవకాశంలేదు. తెలుగులో చివరగా వెలువడినవి 1948లో తెలుగు అకాడమీ ప్రచురించిన "విజ్ఞాన సర్వస్వాలు". ఇవి బహు కర్తృకములు. అకారాది క్రమంలోగాక, ఆయా శాఖలకు సంబంధించిన విజ్ఞానాన్ని ఆయా సంపుటాల్లో వెలువరించిన గ్రంథాలివి. వీనిలో అన్నిశాఖలకు సంబంధించిన విజ్ఞానం కొంత వరకు సమీకరింపబడి యున్నను. వీనిని సంపూర్ణమైన విజ్ఞాన సర్వస్వాలుగా పేర్కొనుటకును, ఎన్‌సైక్లోపెడియా బ్రిటానికా మొదలైనవాని స్థాయిలో చేర్చుటకును అవకాశాలు మృగ్యము.

విజ్ఞాన సర్వస్వాలని వ్యవహారం లేకపోయినను ప్రాచీన కాలం నుండి ఆ లక్షణాలు గల కావ్యేతిహాసాలు అనేకం వెలువడి ఉన్నాయి. వేదాలు, పురాణాలు, భారతం మొదలైన వానియందు విజ్ఞాన సర్వస్వ లక్షణాలు కన్పిస్తున్నాయి. వేదాలకు, భారతానికీ, "ఋక్సంహిత, భారత సంహిత" అను విధంగా "సంహిత" శబ్దము చేర్చుట గలదు. వేద శబ్దమును బట్టియు, సంహిత శబ్దాన్ననుసరించియు

ఇవి విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల గ్రంథములుగా చెప్పవచ్చును. వేదశబ్దము విద్ అను ధాతువునుండి పుట్టింది. విద్ అనగా తెలుసుకొనబడినది లేదా జ్ఞానము అని చెప్పబడింది.[1] అదేవిధంగా సంహిత అనగా సంధింపబడినది, నిబంధింపబడినది అని ఆంధ్రవాచస్పత్యము వక్కాణ. దీనినిబట్టి వివిధాంశ ముల నేకత్ర సంధింపజేయుటయే సంహిత లక్ష్యమని తెలియుచున్నది. నేటి విజ్ఞానసర్వస్వాల లక్ష్యం కూడా ఇదియేగదా!

"విజ్ఞాన సర్వస్వమనగా—మానవ విజ్ఞానాన్ని సమన్వయపూర్వకంగా సమీకరించి, క్రమబద్ధమగు అవగాహనకు వీలగునట్లు ఉపపాదించునదిగా ఉండ వలెను. వ్యాపకమగు సమన్వయాత్మకమగు వ్యవస్థ ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి, తదనుగుణంగా రచన సాగించవలెను." అని విజ్ఞాన సర్వస్వాలనుగురించి ఆన్‌స్టెడ్, డిడిరో, న్యూమెన్, కాల్‌రిడ్జ్ మొదలైన పాశ్చాత్య పండితులు అభిప్రాయపడి యున్నారు.2

దీనినిబట్టి వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాన్ని ఒక్కచోట నిబంధించుట విజ్ఞాన సర్వస్వానికి ప్రధాన లక్షణంగా కన్పిస్తున్నది. ఈ లక్షణాలుగల గ్రంథాలు-వేదాలు, పురాణాలు, భారతం (సంస్కృతం) భారతం, వాణీవిలాస వనమాలిక హంసవిసంతి (తెలుగు) మొదలైనవెన్నియో మనకు గలవు. ఈ విధంగా అనాదిగా ఏదో ఒక రూపంలో వస్తున్న ఈ విజ్ఞాన సర్వస్వాలను గూర్చి పరిశీలించుట ఎంతైనా అవసరం.

విజ్ఞాన సర్వస్వము అనుదానికి సమానార్థకంగా ఆంగ్లములో ఎన్‌సైక్లోపెడియా అను పదం వాడబడు చున్నది గ్రీకు భాషా పదాలను "Enkylio-paideia" అను రెండు పదాలు కలిసి Encyclo Paedia అను పద మేర్పడింది.

Enkyklio = Circle = చక్రరూపమైన

Paideio = of leavning = విద్య లేక విజ్ఞానము. అనగా—విద్యావలయం. లేదా విజ్ఞాన చక్రము అని దీని భావము.3

పైనచూపిన నిర్వచనాన్నిబట్టి గ్రీకులు ఎన్‌సైక్లోపెడియా అనుదానిని ఒక పద్ధతిప్రకారం చెప్పబడ్డ సంపూర్ణ విజ్ఞానంగా భావించినట్లు తెలియుచున్నది.

"The Greeks seems to have understood by Encyclo Peadia instruction in the complete system or cirle."4

క్రీ.శ. 1558లో ఇలియట్ అనునతడు తన లాటిన్ డిక్షనరిలో ఎన్‌సైక్లోపెడియా అను పదాన్ని నిర్వచిస్తూ— "క్రమపద్ధతిలో కూర్చబడిన అన్ని సిద్ధాంతాల సమాహారమే విజ్ఞాన సర్వస్వం"5 అని చెప్పియున్నారు.

ఈ నిర్వచనం మన వేదాలకు, పురాణాలకు, భారతానికి కొంతవరకు సరిపోవుచున్నది ఒక క్రమపద్ధతిలో చెప్పకపోయినను మానవాభ్యుదయానికి హేతుభూతాలైన ధర్మం, నీతి, న్యాయం సాహిత్యం, జ్యోతిషం, గణితం మొదలైన అనేక విషయాలు మన వేదాలలోను, పురాణాలలోను, భారతంలోను నిబంధింపబడియున్నవి. వేదాలు ప్రపంచ వాఙ్మయానికే ఓంకారము, మానవ విజ్ఞానానికి శ్రీకారములని కొనియాడ బడుచున్నవి.

మాక్సుముల్లర్ తన "Heritage of India" అను గ్రంథంలో వేద ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ— "మానవజాతి విజ్ఞాన సర్వస్వాలనదగిన వేద వాఙ్మయము మనకొక క్రొత్త అధ్యాయాన్ని సృష్టించింది. దీనికి సాటిగా నిలువగలవి ప్రపంచంలో మరెచ్చటను గానరావు."6 అని తెలిపియున్నారు.

తెలుగులో వెలసిన సంగ్రహాంధ్ర విజ్ఞానకోశాలకు అధ్వర్యంవహించిన ఆచార్యఖండవల్లిగారు— "మానవుని మనోవికాసానికి నిత్యజీవితానికి అవసరమౌ కళా శాస్త్రాల, ప్రకృతిశాస్త్రాలయొక్క అవృత్తియే విజ్ఞాన

సర్వస్వం."7 అని నిర్వచించియున్నాడు. విజ్ఞాన సర్వస్వాలనుగూర్చి ఖండవల్లిగారు చేసిన ఈ నిర్వచనం కొంత విపులంగాను, విస్తృతంగాను ఉన్నప్పటికి సంపూర్ణమైనదిగా తోచదు. విశ్వ విజ్ఞానమంతయు అటు కళాశాస్త్రాల్లోను, ఇటు ప్రకృతి శాస్త్రాల్లోను అంతర్భవించును. అంతేగాక కళాశాస్త్రాలు మానవ మనోల్లాసానికి, ప్రకృతి శాస్త్రాలు అతని జీవనోపాధికి, అభ్యుదయానికి మిక్కిలి ఉపయోగాలు. అయినా ఈ నిర్వచనంలో ప్రపంచ వీధుల్లో వికీర్ణమైయున్న విజ్ఞానాన్ని సమీకరించవలసిన పద్ధతి, చెప్పవలసిన తీరు కన్పించుటలేదు.

ఇదేవిధంగా తెలుగులోను, ఆంగ్లమునందును విజ్ఞాన సర్వస్వాలనుగూర్చి ఎన్నో నిర్వచనాలు వెలువడుచున్నను, నేడు వెలువడుచున్న విజ్ఞాన సర్వస్వాల దృష్ట్యా క్రొత్త క్రొత్త నిర్వచనాలును వచ్చుచున్నవి.

"చరాచర జగత్సృష్టిలోని వివిధ శాఖలకుచెందిన విషయ సంఘాతమును ప్రమాణపూర్వకంగాను, సమన్వయపూర్వకంగాను సమీకరించి, సామాన్యులకు సైతము అర్థమగునట్లు క్రమబద్ధంగా రచించుటే విజ్ఞాన సర్వస్వము"

పైనచూపిన విజ్ఞాన సర్వస్వాల నిర్వచనాలను బట్టియే వీని ఆశయాలును కొంతవరకు తెలియుచున్నవి. స్థావర జంగమాత్మకమైన ఈ విశ్వంలో వికీర్ణమైయున్న విజ్ఞానాన్ని ఒక్కచోటుకు చేర్చి ప్రజలకు పరిచయం చేయుటయే నాటి సంహితల యొక్కగాని, నేటి విజ్ఞాన సర్వస్వాలయొక్కగాని పరమాశయమై యున్నది.

భారత సంహితా నిర్మాణ ప్రశంస నుగ్గడిన్నా నన్నయచెప్పిన వాక్యము లీ సందర్భంలో పరిశీలించదగినవి.

మ॥ అమితాఖ్యానక శాఖలంబొలిచి వేదార్థాలచ్ఛాయమై
సుమవర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి
కృష్ణార్జునోత్తమ నానాగుణ కీర్త్యర్థ ఫలమై
ద్వైపాయనోద్యానజాతమహాభారత పారిజాతమమరున్
ధాత్రీసురప్రార్థనమై 8

అనేకమంది రాజుల, ఋషుల, దేవతల ఆఖ్యానములతోగూడి వేదములందలి మహార్థములకు వ్యాఖ్యానరూపమై, చతుర్వర్గ పురుషార్థాలను ప్రతిపాదించు మహాభారత సంహిత కల్పభూజమైన పారిజాతముతో పోల్చబడింది పారిజాతము కోరినదిచ్చు శక్తిగలది. మహాభారత పారిజాతము విశ్వవిజ్ఞానంలోని వివిధాంశాలను విపులీకరించి సకల లోకాలకు హితము చేకూర్చునది.

"ఇట్టి మహాభారతంబు సనేకవిధ పదార్థ ప్రపంచ సంచితంబు ఉపపర్వ, మహిపర్వోప శోభితంబును, ద్వీప మహాద్వీప సంభృతంబయిన భువనంబుజుండు నిర్మించినట్లు కృష్ణ ద్వైపాయనుండు నిఖిలోక హితార్థంబు దత్తావధానుండై సంవత్సర త్రయంబు నిర్మించె".9

ఈ అనంత విశ్వాన్ని అజుడు సృష్టించినట్లు, ఆ విశ్వవిజ్ఞానంతో గూడిన మహాభారత సంహితను వ్యాసమహర్షి నిఖిలలోక హితార్థంబు నిర్మించినాడట. కాబట్టి విజ్ఞాన సర్వస్వమనదగు మహాభారతాన్ని నిర్మించుటలో వ్యాసుని ఆశయం "నిఖిలలోక హితార్థము" అని తెలియుచున్నది. నేటి విజ్ఞాన సర్వస్వాల ఆశయమును విశ్వవిజ్ఞానాన్ని ప్రపంచ ప్రజలకందించుటయేగదా!

ఈ విషయాన్నే ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వము యొక్క సంపాదకులలో ప్రముఖుడైన డెన్నిస్ డిడిరో ఈ విధంగా వివరించియున్నాడు "ప్రపంచ వీధుల్లో వికీర్ణమై పడియున్న విజ్ఞానాన్ని రాశి చేసి సమకాలికులకు పరిచయం చేయుటయే విజ్ఞాన సర్వస్వపు టాదర్శం. అనంతర తరాలవారికి విజ్ఞాన భాండారాన్నందించుటయు దీని లక్ష్యమే".10

డిడిరో చెప్పిన పైవాక్యాలు విశ్వవిజ్ఞానాన్ని సమకాలీన ప్రజానీకానికి పరిచయం చేయుటయేగాక, ఆ విజ్ఞానాన్నంతటిని భద్రపరిచి భావితరాల వారికందించుటయు విజ్ఞాన సర్వస్వాల పరమాశయమని చాటుచున్నవి.

సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలకు సంపాదకత్వం నిర్వహించిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు- "విశ్వవిజ్ఞానాన్ని సంక్షేమరూపంలో ఆంధ్రకుటీర ప్రాంగణానికి గొనివచ్చుటయే" సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాల ఆశయమని చెప్పియున్నాడు.11

ఈ వాక్యాలను బట్టి ప్రపంచ విజ్ఞానాన్ని ప్రమాణ పూర్వకంగా సమీకరించి, క్రమపద్ధతిలో తమ ప్రజలకందించుటయే విజ్ఞాన సర్వస్వాల ఆశయమనుట స్పష్టము.

ఇటువంటి ఉన్నతాశయాలతో నిర్మాణమైన విజ్ఞాన సర్వస్వాలు-ప్రజలను చైతన్యపూరితులుగాను, విజ్ఞానవంతులుగాను చేయుట, తద్వారా జీవితాన్ని సుఖవంతంగా నొనర్చుటనునవి ప్రయోజనాలుగా గల్గియున్నవి.

వ్యాసుడు నిఖిలలోక హితార్థంబు భారత సంహితను నిర్మించి దాని ప్రయోజనం సిద్ధించుటకు-"దానిని దేవలోకంబున వక్కాణింప నారదంబనిచె. పితృలోకంబున వక్కాణింప నసితుండైన దేవలుంబనిచె గరుడ గంధర్వ యక్షరాక్షసలోకంబులందు వక్కాణింప శుకునుంబనిచె......... మనుజలోకంబున జనమేజయునకు వక్కాణింప వైశంపాయుంనిబనిచె".12

ఇట్లు సకలలోకాలందు విజ్ఞాన ప్రసారం సాగుట వలన విజ్ఞానావలోడనం వలన సకల ప్రజలు చైతన్యపూరితులై తమ జీవితాలను సుఖమయం గావించుకొనుటయే వీని ముఖ్యప్రయోజనం.

విజ్ఞాన సర్వస్వాల లక్ష్యం, ప్రయోజనం ఎన్‌సైక్లోపెడియా బ్రిటానికాలో మొట్టమొదటనే ఈ విధంగా చెప్పబడింది.

"Let Knowledge grow from more to more and thus be human life in-riched".13

విజ్ఞానం శాఖోప శాఖలుగా పెరిగి ప్రపంచ ప్రజలకందుబాటులోకి రావాలనేది దాని ఆశయం. దానివలన మానవ జీవితం సంతోష సౌభాగ్యాలతో విలసిల్లాలనేది దాని ప్రయోజనం

విజ్ఞాన సర్వస్వాల ప్రయోజనాన్ని గూర్చియు, అవి నిర్మించకపోయిన కలుగు ప్రమాదాలను గూర్చియు డెన్నిస్ డిడిరో ఈ విధంగా వాకృచ్చియున్నాడు.

"........ఇట్లు చేయుటవలన (విజ్ఞాన సర్వస్వాలు నిర్మించుటవలన) పూర్వ పూర్వ తరాల వారి విజ్ఞానం ఉత్తరోత్తర తరాల వారికి అందుబాటులోనికి వస్తున్నది. లేకున్నచో అది నష్టమగు ప్రమాదం గలదు. మన సంతతివారు విజ్ఞానావలోడనంచే జ్ఞానవంతులు సుఖవంతులు కాగలుగుటయు మన లక్ష్యము".14

డిడిరో వాకృచ్చిన ఈ వాక్యాలను బట్టి పూర్వ తరాలవారి విజ్ఞానాన్ని సమకాలీన ప్రజలకందించుటయేగాక, దానిని భద్రపరచి భావి తరాల వారికందించుట, తద్వారా నిద్రాణమైయున్న ప్రజల్లో విజ్ఞాన బీజాలు వెదజల్లి వారిని చైతన్యవంతులుగాను సుఖవంతులుగాను చేయుటలోనివి అనితర సాధనాలనియు తెలుస్తున్నది. ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వాల చరిత్రవలన ఇది స్పష్టమనుట లోకవిదితమే.

"విజ్ఞాన సర్వస్వము ప్రయోజనాత్మక సాహిత్యము

జీవితమునకానందము కల్గించుటకిది ఆధారభూతమైనది."15

అనిఖండవల్లిగారు విజ్ఞాన సర్వస్వాల ప్రయోజనాన్ని గూర్చి అభిప్రాయ పడియున్నాడు.

విజ్ఞాన సర్వస్వాలవలనకలిగే పైన చెప్పిన ప్రయోజనాలు కొంతవరకు సృజనాత్మక సాహిత్యము నందును ఇమిడియున్నవి. కావుననే మన పూర్వులు మహాభారత పురాణాదుల విజ్ఞాన సర్వస్వాలుగా నిర్మించి యున్నారు. కాని ఇట్టి సృజనాత్మక సాహిత్య మంతయు పరిణతబుద్ధులకు మాత్రమే పరిమితమై యున్నది. జనసామాన్యమునకది అందుబాటులో లేదు. సామాన్య ప్రజలకు విషయమునంతయు, విపులంగాను అసందిగ్ధంగాను, అవగాహనకనువగు రీతిలో చెప్ప వలసిన ఆవశ్యకత గలదు. అందుకు తగిన సాధ నాలు విజ్ఞాన సర్వస్వాలే. కాబట్టి ప్రపంచముయొక్క నలుమూలల నుండి అన్ని అంశాలకు సంబంధించిన జ్ఞానాన్నంతటిని ప్రమాణ పూర్వకంగా సమీకరించి, ప్రజల అవగాహనకు వీలగునట్లు క్రమపద్ధతిలో వానిని నిర్మించి ప్రజలకందించవలసిన అవసరం నేటి భారతా వనికెంతగానో ఉన్నదనుటలో నెట్టి విప్రతి పత్తియు లేదు.

తెలుగులో ఇప్పటికి నాలుగు తీరుల విజ్ఞాన సర్వ స్వాలు వెలసియున్నను, అవి విజ్ఞాన సర్వస్వాల ఉన్నతాశయాలను, ప్రయోజనాలను నెరవేర్చుటలో సమగ్రములు కాకపోవుటచే, సర్వసంపూర్ణమైనవి జ్ఞాన సర్వస్వాల నిర్మాణావశ్యకత తెలుగుదేశంలో ఎంత గానో ఉన్నది.

విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలో పూర్వతరాలవారి విజ్ఞానాన్ని భావితరాలవారికందించకపోయిన అది నష్ట పోవు ప్రమాదం గలదని డిడిరో హెచ్చరించి యున్నాడు. ఈ దృష్టితో చూచిన నేటి సైన్సు, టెక్నాలజి, ఇంజనీరింగు, భౌతిక రసాయన శాస్త్రాలు జీవశాస్త్రం మొదలైన ప్రకృతి శాస్త్రాలు, సాహిత్యం సంగీతం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన కళా శాస్త్రాలతోబాటు మన భారతం, పురాణాలు, ప్రబం ధాలు, వాణీ విలాస వనమాలిక, హంస వింశతి మొదలైన వానియందున్న మన పూర్వతరాల వారి జీవిత విధానానికి సంబంధించిన విజ్ఞానాన్ని కూడా విశ్లేషణపూర్వకంగా సమీకరించి ఆంధ్రకుటీర ప్రాంగ ణానికి తీసుకొనిరావలసి యున్నది ఆట్టి విజ్ఞాన సర్వ స్వాలు తెలుగులో నిర్మాణమైననాడే అవి విజ్ఞాన సర్వ స్వాల ఉన్నతాశయాలను, ప్రయోజనాలను నెరవేర్చిన వౌతాయి. అప్పుడే అవి ప్రపంచ ప్రఖ్యాతిగన్న ఎన్ సైక్లో పిడియా బ్రిటానికా, ఎన్ సైక్లోపెడియా అమె రికా మొదలైన వాని ప్రక్కన సాటిగా, దీటుగా నిలువగలవని ఆశిద్దాం. అటువంటి ఉన్నత ప్రమా ణాలుగల విజ్ఞాన సర్వస్వాలు మనభాషలో వెలువడ గల శుభోదయం కొరకు ఎదురు చూద్దాం.

సమాప్తం

## అధోజ్ఞాపికలు

1. విజ్ఞాన సర్వస్వము–xi-పుట-1
2. విజ్ఞాన సర్వస్వము-vii-పుట-28
3. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము-i (పీఠిక)
4&5. ఎన్‌సైక్లో పెడియా బ్రిటానికా - viii - పుట - 364
6. మన సంస్కృతి-మన సాహితి-పుట-3
7. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము-i (నివేదనము)
8&9. శ్రీమదాంధ్ర మహాభారతము, ఆదిపర్వము ప్ర.ఆ. 66,67
10. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము-i (పీఠిక)
11. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము-i (నివేదనము)
12. శ్రీమదాంధ్ర మహాభారతము, ఆదిపర్వము ప్ర.ఆ - 67
13. ఎన్‌సైక్లో పెడియా బ్రిటానికా- కవరుపేజీ
14. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము-i (పీఠిక)
15. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము-i (నివేదనము)

# సినీవాలి కావ్యంలో వైచిత్రి

ఎల్. సంగయ్య

ఆరుద్ర సినీవాలి ఐదు ఆశ్వాసాల ఆధునిక కావ్యం. 1960లో ప్రథమ ముద్రణ వెలువడింది. ఆరుద్ర వ్రాతలు వాటికి పెట్టే పేర్లు వింతగా ఉంటాయి. కాటూరి వెంకటేశ్వరరావుగారు సాహిత్య ఆకాడమీ సభలో మాట్లాడుతూ ఆరుద్రత్వమేవాహం వ్రాసినాడని చెప్పబోయి పొరపాటున సినీవాలి అన్నారట. ఆ మాట పొరపాటున అన్నారని వదిలివేయక దానిని నిజం చేశారు ఆరుద్రగారు. ఆదే పేరుతో కావ్యం వెలువరించారు. సినీవాలి పదానికర్థం సుబోధకం కాదు గనుక నిఘంటువులోని అర్థములనిచ్చియున్నారు. పార్వతీ సతియని, చంద్రకళ కనపడు అమావస్యకిది పేరు అని సినీవాలికి అర్థమిచ్చియున్నారు. సాధారణంగా కావ్యం వ్రాసిన తరువాత కావ్య నామకరణం జరుగుతూ ఉంటుంది. ఎవరి నోటి ద్వారానో పొరపాటున వచ్చిన సినీవాలి మాటను నిజం చెయ్యడమే సినీవాలి నామకరణం వెనుకనున్న అంతరార్థం.

యాంత్రిక నాగరికత కాంతివంతమైన చీకటిలాగా జీవితాన్ని ఆవరించి వేళ్ళాడుతున్నప్పుడు, ఛందస్సుకి విడాకులిచ్చినప్పుడు, జాతిజీవనంలో తీరుబాటు తగ్గుతున్నపుడు కవిత్వం తన పాత ఆఫీసు నుండి నిష్క్రమిస్తున్న రోజులలో వ్రాసినదీ కావ్యము. ఇటువంటి పరిస్థితులలోనే వైచిత్రి కావ్యాలలో చోటు చేసుకుంటుంది. శ్రీవర్స్ గ్రంటువారు అడుగు పెడుతున్న రోజులలో వెలువడినదే అయినప్పటికి దీనిని పూర్తిగా వచన కవిత్వంలో వ్రాసిన కావ్యం అనలేము చంపూ కావ్యం వలె పద్యం, గద్యం, వచన ఖండికలు ఇందున్నాయి. వచనకవిత వ్రాస్తూ, వ్రాస్తూ మధ్యలో కందపద్యాన్నో, వృత్తపాదాన్నో లేక ద్విపదలో ఉంచటం జరిగింది.

"నగరంలో యామిని

నరకంలో ఆమని"- అని రెండు గేయపాదాల తరువాత గద్యం కావ్యంలోని కథానాయకుడు, యువకుడు. పేరు సూర్యుడు. కళాశాలనుండి నిష్క్రమించి కళ్ళు మూసుకొని నగరంలో ప్రవేశించాడు. కడుపు మంటతో కాలిపోతూ, కన్నీళ్ళపై స్వారి చేస్తూ పేవ్మెంట్ మీద పడుకోడానికి పెద్ద దైవసంస్కారం చేత బట్టుకొని స్వగతంగా సతమత మవుతున్నాడు, అని వచనాన్ని ముగించి-

కం॥ "దావానల తుల్యోజ్జ్వల
భావానల కీలలోన పడుతూ ఉంటా
భావాలకు బానిసనై
కావాలని గాలిమేడ కడుతూఉంటా"

అని కందపద్యం వ్రాస్తారు. దీని తరువాత కూడా ఒక కందపద్యం, ఒక వచనం వ్రాసి, తరువాత

ఇక్కడ దొరకనిదేదో
చక్కదనం అభిలషించి
ఎక్కడికో పోదామని
రెక్కవిప్పు చైతన్యం.

ఇది 3 మాత్రల చొప్పున పాదానికి 12 మాత్రలతో నడుచు గేయం.

పద్యాన్ని, గద్యాన్ని, గేయాన్ని, వచన కవితను నింపుకొని ప్రక్రియా వైవిధ్యముతో వైచిత్రిని సంత

రించుకొన్న ఆధునిక కథా కావ్యము. దీనిలోని కథ ఆధునిక నగర జీవనానికి సంబంధించినది. ప్రాచీన కావ్యాలలో వలెనే పాత్రల ప్రవేశము, వీటికి ఆధునిక వ్యాఖ్యానము భావములో, భాషలో, రూపంలో, పాత, కొత్తలను గమ్మత్తుచేసి చూపిన కావ్యము. ఈ కావ్యములో రూపంలో కొత్తదనం, భావంలో కొత్తదనం ఈ రెండింటి కలయికవల్ల వచ్చిన ఒక కొత్తదనమే వైచిత్రిగా భాసించుచున్నది. ఆధునిక కావ్యాలలో కథాపాత్రలు ఉన్నా వచనంలోనో, గేయంలోనో, వ్రాసినవి లేదా పూర్తిగా పద్యంలో వ్రాసినవి మాత్రమే కలవి కాని, ఇన్నిటిని కలగలుపుకొన్న కావ్యము ఆధునిక కావ్యములలో లేదు. ఒక గొప్ప శిల్ప నిర్మాణంతో చేయవలెనన్న దృక్పధంతో, వైచిత్రి మీదగల మిక్కిలి మక్కువతో ఈ కావ్యాన్ని ఈ విధంగా వ్రాసినట్లు మనకర్థమవుతుంది. దాదాపు ఇటువంటి ప్రయోగం ఆధునిక కవులలో ఎవరూ చేసి యుండలేదు.

హైదరాబాదు నగరంలో ఎన్. జి. వోలు, మధ్య తరగతి జనం, పేదవర్గం, కార్మికులు పడుతున్న బాధను సూచించేందుకు ప్రత్యేకంగా ఒక్కొక్కరి గురించి, వారి బాధల గురించి పెంచి వ్రాయకుండా పాఠకుని విసుగు నీరసము కలిగించకుండా సంక్షిప్త శబ్ద చిత్రాన్ని హైదరాబాదులో చూపించినారు. హైదరాబాదులోజనంపడుతున్న బాధ హైదరాబాదులో వ్యక్తమవుతుంది.

శబ్దాలు తమ అర్థాలను మార్చుకొన్నాయి. వింతైన కొత్త కొత్త ముసుగులను వేసికొన్నాయి కావ్యాలలో విచిత్రంగా కనిపిస్తున్నాయి. "విచిత్రమే సౌందర్యం, సౌందర్యమే విచిత్రం" ఇటువంటి వైచిత్రిని కనబరచటంవల్లనే మానసికానందం కలుగుతుంది. ఈ 'హైదరాబాధ' అను ప్రయోగము వైచిత్రితో కూడినదేకాదు. ధ్వనివంతమైనది.

హైదరాబాదు నగరాన్ని వర్ణిస్తూ-

"నీ నగరం ప్రొద్దున్నే ఎదురొచ్చే
ప్రశస్తమైన విశ్వస్త
బలవంతప్పెళ్ళిలోని ముదనష్టపు పెళ్ళికూతూరు.

వ్యాకరణాల సంకెళ్ళు విడిచి, చిన్నయ్య సూరిని చాల దండించి కొనితెచ్చిన వైచిత్రి ఈ బలవంత ప్పెళ్ళిలో మనకు కన్పిస్తుంది. 'ముదనష్టపు పెళ్ళి కూతురు అనివిసంధిగానే వ్రాశారు. 'బలవంత ప్పెళ్ళి'లో సంధి చేయటానికి వీలు లేకపోయినా సంధి చేశారు. ఒక పదం చివర హల్లు ఉండి, రెండవ పదం మొదట కూడా హల్లు ఉన్నప్పుడు సంధి చేయరాదు. సంధి చేసిన నియమోల్లంఘనము. సరిగ్గా ఈ వ్యవస్థను ప్రతిబింబించు చున్నది ఈ ప్రయోగము.

అసలే ముదనష్టపు పెళ్ళికూతురు. అందులోను బలవంతపు పెళ్ళి. బలవంతంగా, ఇష్టంలేకున్నా సరే ఒకళ్ళకేసి ఒకళ్ళను అంటగట్టటం అనే అర్థం ధ్వనించేటట్లు 'ప' కారము మీద 'ప' కారాన్నెక్కించి 'బల వంతప్పెళ్ళి' అని చేశారు, ఇందు శబ్ద వైచిత్రి, భావ వైచిత్రిని కనబరచి, పాఠకులకు ఒక పెద్ద కాన్వాసు మీద ఈ వ్యవస్థ నిజచిత్రం కనబడేటట్లుగా చేసినారు. క్రమవైచిత్రి :

-గత జలాలను మరలించగలదా ? -ఎండిపోయిన ఎడారి పండించగలదా ?

హతాశయులను లాలించగలదా ? గుండెలలో సంతృప్తి నిండించగలదా ?

ఇందులో 1, 3 పాదాలను చదివిన తరువాత, 2, 4 పాదాలను చదివినచో భావక్రమ మేర్పడును. ఆరుద్ర తన వెయ్యి వోల్టుల కవిత్వం అన్న శీర్షికలో కూడా ఈవిధంగా చేస్తాడు. అందులో + గుర్తు గల వాక్యాలను చదివిన తరువాతనే '—' గుర్తు గల వాక్యాలను చదువవలెను. అప్పడే మనకు ఆ కవిత అర్థం అవుతుంది. అదేవిధంగా పైన ఉదహరించిన భాగముకూడా చదువుకొనవలెను. అయితే ప్రాచీన

కావ్యాలలో గల పద్యాలలోకూడా ఇటువంటి అన్వయము అవసరం వస్తుంది. కాని వారు ఈ పద్ధతి శిల్ప నిర్మాణంగా, పెట్టుకోలేదు; ఛందస్సుకు ఒదిగేకట్లుగా, నడక తీరునుబట్టి అర్థం చెడకుండా, యథాలాపంగా పదాల స్థానాలు మారేయి. వాటిని అన్వయించి చెప్పికొనెడి వారము. కానీ ఆధునికులు కావాలని చేసిన నూతన ప్రయోగ వైచిత్రులు ఇవి. పై నుదహరించిన దానిలో భావ క్రమాన్ని కనుగొనిన తరువాత మన మనసులో ఒక మెరుపు మెరిసినట్లగును.

ఉద్యోగంకోసం వెళితే ఇంటర్వ్యూచేసిన విధంగా వివాహం చేసికోవటానికి ఇంటర్వ్యూ చేయటం ఇందులో క్రొత్తగా కన్పిస్తుంది. ఆధునిక కావ్యాలలో ఇటువంటి సంభాషణలద్వారా ప్రయోగాలు చేసినవారు నూటికి ఒకరిద్దరేమో?

ఈ క్రిందివిధంగా ఇంటర్వ్యూ సాగుతుంది.

తండ్రి

ఎవరీ అమ్మాయి?

ధనవంతుడు

అలంకారాల్లేవే?

మొదటి అమ్మాయి

నాజూకుగా లేదే?

రెండవఅమ్మాయి

అదే ఫేషనేమో?

మూడో అమ్మాయి

భరత నాట్యం వచ్చా?

ఊహాసుందరి:

నాగలి నా తండ్రి

తండ్రి

ఎవరు మీ తల్లి

ఊహాసుందరి

సృష్టి నా తల్లి

తండ్రి

ఏమిటి నీ ఆస్తి?

ఊహాసుందరి

ఎవరికైనా ఆస్తిలో ఏముంటుంది.

సంగీతంలో సప్తస్వరాలు.

సాహిత్యంలో ఏభైరెండక్షరాలు. — ఈవిధంగా సాగుతుంది. ఇంటర్వ్యూ. పరిశీలించి చూచినచో ఇందు కవిత్వం పాలులేదని చెప్పవచ్చును. కవిత్వం లేకపోయినప్పటికి ఈ పద్ధతిలో వ్రాయటం మనల్ని ఆకర్షిస్తుంది. సమాజంలో అవివాహితయైన సగటు స్త్రీని ధనవంతులు, వ్యాపారస్తులు, ఛాదస్తులు ఎలా ప్రశ్నిస్తున్నారో ఇందులో రూపుదిద్దుకొన్నది. ఇది (Form) రూపానికి సంబంధించి తెచ్చుకొన్న క్రొత్తదనం.

ఊహాసుందరి

మానవ గడియారానికి ఒక్కసారికీ చాలు.

అది మీరు-అంటే (సూర్యుడు)

కలకాలం మెయిన్‌స్ప్రింగ్ కావాలి.

అది నేను. (ఊహాసుందరి) — మెయిన్‌స్ప్రింగ్ లేకపోతే గడియారం పనిచెయ్యదు. స్ప్రింగ్ ఉన్నంత మాత్రానకూడా గడియారం పనిచెయ్యదు. దానికి 'కీ' ఇవ్వాలి. ఆరుద్రగారు మానవ జీవితానికి మంచిమంచి వ్యాఖ్యానాలిచ్చారు. మానవ జీవితమనే గడియారానికి స్ప్రింగ్, కీ, రెండూ ముఖ్యమే. ఏది లేకపోయినా జీవితం గడవదు. యాంత్రిక నాగరికత ప్రభావం పారిభాషిక పదజాలం, క్రొత్త ఉపమానాలద్వారా సాధించిన భావ వైచిత్ర కిది ఉదాహరణ.

మగవాడి జీవితంగురించి గీసిన చిత్రం -

"మగవాడి జీవితం ఒక బైసికిలు
దాని ముందు చక్రానికి బ్రేకు తండ్రి
వెనుక చక్రానికి బ్రేకు భార్య."

వేగంగా పోతున్న సైకిలు ముందు చక్రానికి బ్రేకు సడెన్‌గా వేస్తే క్రిందకు పడిపోతాము. ఒక యువకుడు అభ్యుదయ మార్గంలో నడువవలెననే భావముతో ముందుకు పరుగెత్తునపుడు తండ్రి వేసే ముందు బ్రేకు వివాహం. ఈ వివాహం బ్రేకుతో ముందుకు పడిపోతాడు యువకుడు. వివాహానంతరము భార్య వెనుక బ్రేకవుతుంది. వెనుక బ్రేకు నావకు దిక్సూచిలా పనిచేస్తుంది. స్పీడును కంట్రోలు చేస్తుంది. ఎత్తు పల్లాలున్నచోట, జీవితంలో ప్రమాదాలు దాపురిస్తున్న సమయంలో భర్తను సరియైన వేగంలో నడిపించగలదు. లేదా పూర్తిగా తిరోగామినిగా చేయగలదు. ఈ మూడు పాదాలలో ముల్లోకాల్ని దాచినట్లుగా పై అర్థాన్నంతటిని ఇమిడ్చినారు. అర్థ విస్తీర్ణతను, అంగికస్పర్శను గర్భంలో దాచుకొని మనకు అందించే కొత్తదనమే ఈ కావ్యమందలి వైచిత్రి. ఇటువంటిదే చిన్న ఉదాహరణ-

జీవితం రేడియో సెట్టుకి

భర్త ఏరియల్

భార్య ఎర్తు అని జీవితానికి అద్భుతమైన వాసం చేసినాడు ఆరుద్ర.

నవ్య కవిత్వానికి నయాగరా
అర్థ9తకు మరోపేరు ఆరుద్ర 'కదా'



# షేక్స్పియర్ శేముషీ వైభవం

-పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

## వీనస్ అండ్ ఎడోనిస్ :

షేక్స్పియర్ సాహిత్య జీవితంలోని ఈ ద్వితీయ ఘట్టమునందు ప్రమోదాంత నాటకాలతోబాటు కమనీయమైన కవితలని కూడా ఆయన రచించారు. వాటిలో 'వీనస్ అండ్ ఎడోనిస్' ప్రప్రథమంగా పేర్కొనదగింది. దీనిని 1593 లో ప్రచురించి ఎర్ల్ ఆఫ్ సౌత్ ఆంప్టన్ కి కృతి ఇచ్చినా, స్ట్రాట్ ఫోర్డ్ ఆన్ ఎ వాన్‌లో ఉండగానే షేక్స్పియర్ దీనిని, దీనితో జంటగా ఉన్న "రేప్ ఆఫ్ లుక్రీస్"ని ప్రారంభించి ఉంటాడని పరిశీలకుల అభిప్రాయం. స్ట్రాట్ఫర్డ్ పరిసరాలూ, దాని అందాలూ, వీనస్ అండ్ ఎడోనిస్‌లో ఎడనెడా కన్పిస్తాయని ఫర్నివల్ తన వ్యాఖ్యలో సోదాహరణంగా చూపించాడు. 1 నవయుగోదయ ప్రభావం కారణంగా జనించిన నూత్నాభిరుచికి అనుగుణంగా ఒక మహాసౌందర్యరాశిని (Venus) నాయికగానూ, నిర్లిప్తుడైన ఒక అందమైన యువకుణ్ణి (Adonis) నాయకుడుగానూ స్వీకరించడం చాలా సముచితమైన సంగతి. తనలో జనించిన మధుర భావాలకి ఓవిడ్ రచన- మెటమార్ ఫోసిస్- ఊపిరినీ ఉత్సాహాన్నీ ఇయ్యడంతో ఈ కవితకి షేక్స్పియర్ రూపకల్పన చేస్తూ వచ్చాడు. అయితే పూర్తిచేసి ప్రకటించింది మాత్రం 1593 లో. అప్పటికి అతనికి శాలలన్నీ మూతబడ్డాయి. తత్రాపి, షేక్స్పియర్‌కి నాటకరచన తొందరగా కానియ్యవలసిన అవసరం లేకపోయింది. ఆ సంవత్సరం అతనికి బోలెడంత విశ్రాంతి, ఆ విశ్రాంతి సమయాన్ని అతనీ కవితని పూర్తిచెయ్యడానికి వినియోగించాడు.

ఆయన వ్రాసిన టైటస్ ఏండ్రో నికస్‌కి సెనెకా నాటకాలూ, కామెడీ ఆఫ్ ఎర్రర్స్‌కి ప్లాటస్ నాటకాలూ ప్రోత్సాహం ఇచ్చినట్లు వీనస్ అండ్ ఎడోనిస్‌కి ఓవిడ్ వ్రాసిన మెటమార్ ఫోసిస్ ప్రోద్బలం ఇచ్చి ఉంటుందనీ, ఈ కవితలోని ప్రకృతి వర్ణనా, భావనా సౌందర్యమూ, కవితా దృష్టీ, ఇవి అన్నీ ఓవిడ్ నుంచి గ్రహించినవే అనీ రీసీ వ్రాశాడు. 2 1567 లో గోల్డింగ్స్ అనువదించిన ఓవిడ్ గ్రంథము, మెటమార్ ఫాసిస్, షేక్స్పియర్‌కి నిత్యపఠనీయమైన గ్రంథమనీ, తన నాటకాల ఇతివృత్తాల్ని ఎన్నుకోడానికీ, పాత్ర చిత్రీకరణకీ ఆయన ఈ పుస్తకాన్నే ఉపయోగించుకొన్నాడనీ, "కవితకేదీ అనర్హం కాదనే పరమసత్యాన్ని ఆయన దీనినుండే గ్రహించాడనీ, ప్రస్తుతం ఆక్స్‌ఫర్డ్‌లోని బాడ్లియన్ గ్రంథాలయమందున్న గోల్డింగ్స్ అనువాదప్రతి షేక్స్పియర్ ఉపయోగించు కొన్నదే అనీ కొందరు విమర్శకుల

1. 72 వ పంక్తిలో ఎవాన్ నది వర్ణన, 366 లోని తెల్లని గువ్వలు. 453 లోని అరుణోదయం, 531 లోని గుడ్లగూబ ఇవి అన్నీ తరుణ వయస్కుడైన షేక్స్పియర్ స్ట్రాట్ ఓఫర్డ్‌లో చూసి హృదయంలో దాచుకొన్నవే!

1. Vide M. M, Resse's - "Shakespeare- His world and his work"

ప్రస్తుతానికి వస్తే. రచయిత జీవితకాలంతోనే ఈ కవిత బహుళ జనాదరణ పొందినట్లు కనిపిస్తుంది. 16.6 నాటికే, అంటే ప్రథమ ముద్రణ జరిగిన తర్వాత 13 ఏళ్ళలోనే ఇది 11 మార్లు పునర్ముద్రిత మైంది. జాన్ వీవర్ వ్రాతలలో, జాన్ డేవిస్ రచనల్లో, పెర్నాససీ నాటకాల్లో వనసీ అండ్ ఏడోనిస్ ప్రస్తావన ఉంది. టేమింగ్ ఆవ్ ది ష్రూ నాటకంలో కూడా వీనస్ అండ్ ఎడోనిస్ చిత్రాల గురించి ముచ్చటించడం కనిపిస్తుంది. దీనిని బట్టి షేక్స్పియర్ కవితకి ఆ రోజుల్లో ఎంత ప్రశస్తి ఉందో మనకి అర్థం అవుతుంది.

'వీనస్ అండ్ ఎడోనిస్', 'రేప్ ఆఫ్ ల్యుక్రీస్'లు ఒకదాని నుంచి మరియొకటి విడదీయరానివి. మొదటి కవితలో స్త్రీకి గల అనురాగము (లేదా వ్యామోహము) పురుషునికి గల నిర్లిప్తత వర్ణితమైతే, రెండో కవితలో తద్భిన్నంగా పురుషునికి ఉండే వ్యామోహము, స్త్రీకి ఉండే హృదయ నైర్మల్యమూ వర్ణితాలయ్యాయి. అమితాకర్షణీయమైన విశృంఖల విహారము, ఉత్తుంగ తరంగశోభితమైన యువభావ జలధీ, శ్రవణ పేయమైన మధురమంజుల కవిత ఇవి అన్నీ రెండు కావ్య ఖండాలలోనూ కనిపించే ప్రత్యేక లక్షణాలే! ల్యుక్రీసీ కవితని పరిశీలిస్తే "తనలో జనించిన భావోద్రేకాన్ని, కవి అదుపులో పెట్టుకుని సూక్ష్మాతి సూక్ష్మమైన సంగతులెన్నో వర్ణించాడ"ని ప్రముఖ కవీ విమర్శకుడూ అయిన శామ్యూల్ కోల్‌రెడ్జ్ అభిప్రాయపడితే "అసలు ల్యుకీస్‌లో భావోద్రేకమే లేదు. హృదయ దఘ్నంగా కవి ఏ అనుభూతినీ పొందినట్లు కనిపించదు" అన్నాడు మరో ప్రసిద్ధ కవి హేజ్‌లిట్.

అప్పటికింకా ఆంగ్ల రసజ్ఞ పాఠకులు, ట్వెల్త్ నైట్‌లో షేక్స్పియర్ ప్రవహింపజేసిన కవితా రస వాహినుల్ని రుచిచూడలేదు. అందువల్ల వారికి వీనస్ అండ్ ఎ డోనిస్ ప్రతిపద విన్యస్తమైన కవితామృత ఝురీ ప్రవాహంలా కనిపించింది. ఇందలి ఏకత్రయీభావ అనురాగం అనిదం పూర్వం కనుక నాటి ఆంగ్లేయులకి అత్యంత ఆకర్షణీయమైంది. ఈ కవితలో వీనస్ అనురాగం ఎలా కట్టలు తెంచుకొని ప్రవహించిందో, షేక్స్పియర్ భాషాయోషకూడ అవధులెరుగని అందాల సీమల్లో నర్తించింది, రసజ్ఞులకి లలితపద విన్యస్తమైన కవితాగానాన్ని వినిపించింది.

సౌందర్యాధి దేవత అయిన వీనస్, మనోహర మూర్తి అయిన ఎడోనిస్ అనే యువకుని ప్రేమించి అతనిచేత క్రూర వరాహాన్ని వేటాడటం మాన్పిస్తుంది. కాని అతని ప్రేమని పొందలేక పోతుంది. అతడు తిరిగి వేటకి వెళ్ళిపోతాడు. మరునాడుదయం వేట కుక్కల అపస్వరాలు విని కీడు శంకిస్తుంది. ఆమె భయపడినట్లే ఎడోనిస్ క్రూర వరాహ నిహతుడై కనిపిస్తాడు. సూక్ష్మంగా ఇదీ కథ. ఈ కథని తనకవితా చమత్కృతికీ, ఉదాత్త భావ ప్రదర్శనకీ, నిర్మాణ వైచిత్రికీ అనువైన సాధనంగా స్వీకరించి, దృశ్య కావ్యరచనా దురంధరుడైన షేక్స్పియర్, శ్రవ్యకావ్య రచనలోకూడా సిద్ధహస్తుడు అని నిరూపించుకొని, సాహితీప్రియుం భావకులకు సవ్యసాచిగా సాక్షాత్కరించాడు.

## ది టు జంటిల్ మెన్ ఆఫ్ వెరోనా:-

ముందుముందు తాను వ్రాయబోయే నాటకాలకీ, వాటిని రచించే పద్ధతికీ, ఆలోచనా ధోరణికీ, ఆచరణ మార్గానికీ, అన్నింటికీ ప్రయోగశాలగా షేక్స్పియర్‌కి ఉపయోగపడిన "ది టు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా" నాటకం, పూర్తిగా ఆయన స్వకపోల కల్పితమేనా లేదా ఇతివృత్తంవరకూ ఏ గ్రంథంనుంచి అయినా తీసుకున్నారా? ఎన్నో షేక్స్పియర్ నాటకాలలోని కథలకి మూలాధారమైన కథల్నీ, గ్రంథాల్నీ, కనుగొన గలిగిన "బుల్లో" కూడా ఈ నాటకానికి ఆధారమైన గ్రంథం ఏదో చెప్పలేకపోయాడు. ఖచ్చితంగా ఇది ఆధారం అని చెప్పగలిగిన గ్రంథం ఏదీ ఇంత వరకూ లభింపలేదు. లభ్యమైన వాటిలో ఛాలావరకు

ఈ కథకి సారూప్యమైన కథ ఉన్నది, జె.డి. మాంటీ మేయర్ వ్రాసిన 'దయానా ఎనమొరాడా' అనే స్పానిష్ గ్రంథం.

"ఈ నాటకం రచించేనాటికి షేక్స్పియర్ ఆవేశంతోకూడిన ఒక మహానుభావుడు! భావోద్దీపితుని రచన కావడంవల్ల ఈ నాటకం వాస్తవికతని కోల్పోయి జీవితానికి దూరమైంది" అని చార్లటన్ అన్నాడు. అయితే, షేక్స్పియర్‌శిల్పము (Sheakspeare's Workmanship)అనే తన గ్రంథంలో క్విల్లర్‌కూచ్ "పాతయుక్తులుమాని షేక్స్పియర్ ఈ నాటకంలో నిజమైన పాత్రలనీ వాస్తవమైన సంఘటనలనీ సంఘటిత పరిచాడు" అని వ్రాశాడు, ఈ సంగతినే ప్రస్తావిస్తూ మార్టిన్‌హోమ్స్" నాటకంలో కొన్ని అవాస్తవికాలు లేకపోలేదు. చివరి దృశ్యంలోని సంఘటనలు కొన్ని అసందర్భంగాకూడా కనిపిస్తాయి. అయితేయేం? సహజత్వమో సహజత్వమో అంటూ కూర్చోవడంకంటే, సామాజికులకు సంతృప్తినీ ఆనందాన్నీ అందించి, వారు నాటకానికి తిరితిరిగి వచ్చేలాగ చెయ్యడం నాటకకర్త కర్తవ్యం కదా – ముందు అది ముఖ్యం-షేక్స్పియర్ అదే చేశాడు ఈ నాటకంలో" అని వాదించాడు. 1

ఈ నాటకంలో జూలియా, లాన్స్, స్పీడ్‌ల పాత్ర చిత్రణ గమనించతగ్గది. ముఖ్యంగా జూలియా పాత్ర ఓర్పులోనూ దీక్షలోనూ రాబోయే ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్‌వెల్ లోని హెలెనా పాత్రని తలపిస్తుంది. ప్రోటియస్ యొక్క సేవకుని వేషంలో జూలియా సిల్వియాకు వార్తలందించే ఘట్టము, ముమ్ముందు వ్రాయబోయే ట్వెల్త్ నైట్ నాటకంలో, సెసారియో రూపంలో వయోలా ఆర్సినోని ఆశ్రయించే ఘట్టానికి ప్రాతిపదిక ! అలాగే ఈ నాటకంలో జూలియాని అడిగినట్లే, ట్వెల్త్ నైట్‌లో ఆర్సినో సెసారియోని "నీ సోదరి వివరాలూ, ఆమె ప్రేమికుని విశేషాలూ తెలియజెప్పు" అని అడుగుతాడు. మర్చెంట్ ఆఫ్ వెన్నిస్‌లో పోర్షియాని వివాహం చేసుకోడానికి వచ్చిన పెళ్ళికొడుకుల పేర్లని నెరిస్సా ఏకరువు పెట్టినట్లు ఈ వెరోనా నాటకంలో జూలియా వరుల జాబితాని లూసెట్టా చదువుతుంది.

ఈ నాటకం 2 వ అంకం 1 వ దృశ్యంలో "Though the Chameleon love can feed on the air, I am one nourished by my victuals and would fain have meat"అని స్పీడ్ అన్న మాటలే పరిపక్వతచెంది హేమ్‌లెట్ 3 వ అంకం 2 వ దృశ్యంలో "Excellent i' faith; of the Chameleons dish. I eat the air, Promise cramm'd; you cannot feed capons so"గా రూపాంతరం చెందాయి.

మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్‌లోని ఏథెన్స్ దగ్గర అరణ్యంలాగా, యాజ్ యూ లైక్ ఇట్ లోని ఆర్డెన్ అరణ్యంలాగా, ఈ నాటకంలోని మిలాన్ పరిసరారణ్యం కూడా ప్రేమికుల సమస్యలు కొన్నింటిని పరిష్కరించడానికి ఉపయోగపడింది. ఈ నాటకంలో వెలెన్ టైన్ వలె సింబలీన్ నాటకంలో ఇమోజన్ కూడా బహిష్కృతులతో కలిసి ఉంటాడు. ఈ రకంగా చూస్తే ఈ నాటకంలోని ఎన్నిసంగతులో, తర్వాత వచ్చిన నాటకాలలోని చాలా సంగతులకి, మూలములుగానో లేక ప్రయోగములుగానో కనిపిస్తాయి. వెరోనా కంటె ముందు వ్రాసిన నాటకాలలోని డ్రేనియో, గ్రోమియో, డ్రోమియన్ పాత్రలతో పోలిస్తే, వెరోనా నాటకంలోని లాన్స్,స్పీడ్ పాత్రలు పరిణతి చెందినవిగా అర్థం అవుతుంది. అంతే కాదు. తర్వాత షేక్స్పియర్ వ్రాయబోయే నాటకాలలోని లాన్స్ లట్ జొబ్బో, డాగ్ బెరీ పాత్రలకి మాతృకలు అనికూడా తెలుస్తుంది. ఈ నాటకంలోని

1. 'Martin Holmes' 'Shakespeares' Public'

లాన్స్ పాత్ర సృష్టిని జార్జి బెర్నార్డ్‌షా కూడా మెచ్చుకున్నాడు.

ది టు జెంటిల్‌మెన్ ఆఫ్ వెరోనా లోని కథ సంగ్రహంగా ఇది. ప్రోటియస్ వెలంటైన్‌లు వెరోనాలో మిత్రులు. ప్రోటియస్ జూలియాలు పరస్పరం ప్రేమించుకుంటారు. మిలాన్ వెళ్ళిన వెలంటైన్, అక్కడ సిల్వియాని ప్రేమిస్తాడు. ప్రోటియస్ కూడ తర్వాత అక్కడికి వెళ్ళి ఆమెనే ప్రేమించి వెలంటైన్‌కి చిక్కులు కల్పిస్తాడు. జూలియా మిలాన్ వచ్చి మారువేషంలో ప్రోటియస్‌ని సేవిస్తూ ఉంటుంది ఇలా ఉండగా సిల్వియా, మారియోతో జరగబోయే వివాహం నుంచి తప్పించుకొనే ప్రయత్నంతో పారిపోయి దొంగలకి చిక్కుతుంది. ప్రోటియస్ రక్షిస్తాడు. చివరకి సిల్వియా వెలంటైన్‌ని కలుసుకొని అతణ్ణి వివాహం ఆడుతుంది. జూలియా ప్రోటియస్‌ల వివాహం కూడా జరుగుతుంది. ఈ నాటకంలో లాన్స్ అనే ప్రోటియస్ యొక్క విదూషకుడూ, లాన్స్ కుక్క అయిన క్రేబ్ చక్కని వినోదాన్ని అందిస్తారు.

సానెట్స్ :

సానెట్ అనేది ఒక ఛందః ప్రక్రియ ఇది ఆంగ్లమున క్రొత్తది పెట్రోర్క్ మార్గానుసారులై ఈ సానెట్‌లను ఆంగ్లదేశంలోకి 1557 లో ప్రవేశపెట్టిన వారు 1 వియట్, సర్రే, అను ఇద్దరు కవులు. పెట్రార్క్ పద్ధతి ప్రకారము సానెట్ అనేది 14 పంక్తుల పద్యము. మొదటి ఎనిమిది పంక్తులను ఆక్టేవ్ అని తర్వాత ఆరు పంక్తులనూ సెస్‌టెట్ అనీ పిలుస్తారు. షేక్స్పియర్ కూడా సానెట్‌లను 14 పంక్తుల పద్యాలుగానే వ్రాసినా, వాటి నిర్మాణ విధానము మాత్రము ఆక్టేవ్ సెస్‌టెలుగా చేయలేదు. ఆయన సానెట్ నిర్మాణం ఏమిటంటే, నాలుగేసి పాదాలుండే క్వాట్రైన్స్ మూడు, తర్వాత రెండు పాదాలుండే కప్లెట్ ఒకటి.

షేక్స్పియర్ వ్రాసిన సానెట్స్ మొత్తం 154 వీటి రచనా కాలాన్ని 1593 అని స్థూలంగా నిర్ణయించినా, యదార్థంగా షేక్స్పియర్ 1590 ప్రాంతంలో వ్రాయడం ప్రారంభించి 1596 ప్రాంతంలో పూర్తి చేసినట్లు భావించవచ్చు.

1557 లో ఆంగ్ల సాహిత్యంలోకి ప్రవేశించిన ఈ సానెట్, దాదాపు 30 సంవత్సరములు విస్మరింపబడింది. తిరిగి 1590 ప్రాంతమున సానెట్ రచన విరివిగా సాగింది. 1590 తర్వాత 5, 6 సంవత్సరములు ఎంత మంది కవులో సానెలట్‌లను పుంఖానుపుంఖములుగా వ్రాయనారంభించారు.2 వీరిలో సిడ్నీ, డేనియల్ డ్రైటన్‌లు ఆ సానెట్స్‌లో కథావస్తువులుగా ప్రేమ, విరహం వంటి ఆసక్తికరమైన సంగతుల్ని తీసుకున్నారు. సమకాలీన ప్రభావ ఫలితంగా ఈ రోజులలోనే (1590-1596) షేక్స్పియర్ కూడా ఈ కథావస్తువులతోటే సానెటెలు రచించాడని పలువురు విమర్శకుల అభిప్రాయం. అయితే 107 వ సానెట్‌లోని Mortal moon అనే పదాన్ని ఎలిజిబెత్‌కి అన్వయిస్తే వీటి రచనా కాలం 1603 అవుతుంది. లేక అర్థచంద్రాకృతిగా సాగిన స్పైను దండయాత్ర (Spansrh armeda)కి అన్వయిస్తే 1586 అవుతుంది.

---

1. Tottels' miscellany లో wyatt Surrey రచనలు.
2. Sidny's 'Astrophel and stella (1591); Danial's oelia (1592); Lodge's Philhis (1593) Lodge's Giles (1593); Fretches Licia (1593); Castible's Diana (1594); Dryton's Idea (1594); Percy's celia (1594); Barnfield's cynthia (1595); Spencer's Amaretti (1595); Griffin's Fidessa (1596); Smith's Chloris (1596); Robert Tofte's Laura (1597).

ఇవి 154 పద్యాలు, పైన చెప్పినట్లు ఇటాలియన్ రచయిత పెట్రార్క్ ఛందో రీతిని షేక్స్పియర్ అనుసరించలేదు. 3 చతుస్సులు మీద ఒక ద్విపదగా (3 Quatrians and a couplet) రచించాడు. ఈ నియమంతో సానెట్ వ్రాయడాన్ని Shakespeare sonnet అంటారు. పోనీ అని ఈ నియమాన్నయినా మొత్తం 154 పద్యాల్లోనూ పాటించాడా అంటే అదీ లేదు. 126, 153, 154 పద్యాలకి ఈ ఛందో నియమం పాటించలేదు.

షేక్స్పియర్ ప్రతి నాటకంలోనూ అయిదు అంకాలుంటాయి ఈ సానెట్స్ కథని కూడా అయిదు భాగాలుగా విభజించవచ్చు 1. రచయితకి W.H.తో స్నేహం 2 రచయిత నీలా సుందరిని (Dark woman) ప్రేమించడం 3. ప్రతిద్వంద్వి అయిన మరో రచయిత W. H.కి అభిమానపాత్రుడు కావడం 4. రచయిత నిరుత్సాహం చెందడం 5. చివరకి సమాధానపడి తాత్త్వికి దృష్టి నేర్పరచుకోవడం.

రచయిత, W.H. అనే ధనవంతునితో స్నేహం చేసి నీలా సుందరిని ప్రేమించి, దేశాటనకి వెళ్ళడం తిరిగి వచ్చేసరికి ఆ సుందరి W. H. యొక్క ప్రియురాలిగా మారడం అంతేకాక వారికి మరో రచయిత అభిమానపాత్రుడు కావడం - దాంతో మొదట విచారించి, తర్వాత మైత్రిలోని తియ్యదనాన్ని మరువలేక తనలోతాను సమాధానపడడం - ఇదీ ఈ 154 సానెట్లలోనూ సాగిన కథ. ఇందులో 1 నుండి 77, 87 నుండి 125 వరకుగల సానెట్స్ మిత్రుడైన W. H.ని ఉద్దేశించి వ్రాసినవి. 78 నుండి 86 వరకు ప్రతిద్వంద్వి అయిన మరో రచయితని ఉద్దేశించినవి. 128 నుండి 154 వరకూ, అంటే చివరి 27 సానెట్సూ నీలా సుందరిని ఉద్దేశించినవి.

అయితే ఇందులో W. H. ఎవరు ? కేవలం కల్పితమైన పాత్రా ? లేక షేక్స్పియర్ సమకాలీనులు ఎవరైనానా ? W. H. అనగా William Harvey అని కొందరూ, William Hall అని కొందరూ, Henry Wriotheseley అనే పేరుగల Earl of Southampton (ఇతనికే వీనస్ అండ్ ఎడోనిస్ కృతి ఇచ్చింది) అని కొందరూ, నాటకాలలో స్త్రీ వేషాలు వేసే Willion Hughes అనే యువకుడని కొందరూ, 1. అసలు వీరెవరూ కాదు. ఈ పద్యాలన్నీ ఆత్మపరంగా చెప్పుకొన్నవే ! అందువలన W. H. అనగా William himself అనే (అంటే విలియమ్ షేక్స్పియర్) అని కొందరూ అభిప్రాయపడ్డారు ఇలాగే నీలా సుందరి విషయంలో తలొకరూ తలొక అభిప్రాయాన్నీ వెలిబుచ్చారు. ఆమె Maro Filton అని కొందరంటే, కాదు మరో స్త్రీ అని కొందరన్నారు. ఎవరో వివాహిత అయిన స్త్రీ అయి ఉంటుంది. అందుకే Dark woman అనిగూఢంగా చెప్పి ఊరుకున్నాడు అని Dovev Wilson అభిప్రాయ పడ్డాడు.

ఇవి అన్నీ సరే. మరి అయితే ఈ పద్యాల్లో షేక్స్పియర్ వ్యక్తిత్వమూ, వ్యక్తిగత జీవితమూ ఎంతవరకు ప్రతిఫలిస్తున్నాయి? ఒక్క నాటకాలలో తప్ప తక్కిన అన్ని ప్రక్రియలలోనూ రచయిత స్వరూప స్వభావాలు కొంతవరకుఅయినా కనిపిస్తాయి కదా? ఈ ప్రశ్నకి మళ్ళీ తలొకరూ తలో అభిప్రాయం వెలిబుచ్చారు.

సానెట్స్‌లోని సంగతులు షేక్స్పియర్ వ్యక్తిత్వం గురించి తెలిపినా తెలపకపోయినా ఇందలి కథ మాత్రం ఉత్తమ ప్రేమైక వృత్తాంతం అని 1954లో ప్రచురించిన ఆంగ్ల సాహిత్య చరిత్రలో సి.ఎస్. వెలిస్ ఉద్ఘాటించాడు. భావోద్రేకాలతో నిండిన కొన్నిఘట్టాలు పరిశీలిస్తే, తాను అనుభవించిన వివిధ ఆవేశాలకే

1. 20 వ సానెట్‌లో Aman in hue all hues అనే వాక్యం ఆధారంగా ఈ వాదనని Oscar Wimble వంటివారు ప్రతిపాదించారు.

షేక్స్పియర్ కళారూపం ఇచ్చాడనీ కేవలం ఊహా జనితమైన రచనలో ఇలా జీవనాడి స్పందించుట జరగదనీ విల్సన్‌నైట్, వర్డ్సవర్త్‌లు అన్నారు.

ఏమైనా షేక్స్పియర్ వ్రాసిన నాటకాలలో కంటే ఆయన వ్రాసిన ఈ సానెట్స్‌లో ఆత్మప్రత్యయం (Peronality) ఎక్కువగా కనిపిస్తుంది. నాటకాలని బట్టి ఆయన వ్యక్తిత్వంమీద ఏర్పడిన అభిప్రాయాలని ఈ సానెట్స్‌నిబట్టి సర్దుకొని సరిజేసుకోవచ్చు. ఇందులోని నీలా సుందరికి, ఆయన నాటకాలలోని గెర్‌ట్రూడ్, రోసలిన్, హెర్మియా, ఫోబ్, మొదలైన స్త్రీ పాత్రలూ, W.H. కి 'వెరోనా'లోని ప్రోటియస్, హెన్రీ IV లోని హాల్ వంటి పురుష పాత్రలూ ప్రతిధ్వనులు. ఈ సానెట్స్‌లో రకరకాలైన శైలికి, వివిధములైన మానసిక స్థితులకూ దర్పణాలు. వేర్వేరు భావాలకి సౌందర్య రూపాల్ని సంతరించుకొన్న మణినికురాలు. సుశిక్షితమైన స్వేచ్ఛనీ, విశిష్టమైన భావ గాంభీర్యాన్నీ, సూక్ష్మీకృతమైన వివరణనీ, సమకాలీనతని మన్నించే సార్వకాలీనతనీ, ఈ సానెట్స్‌లో, షేక్స్పియర్‌లోని శిల్పకళా ప్రావీణ్యం, మహోదాత్త జీవన ఝరీ కలిసి, బంగారంలో అనర్ఘ రత్నాల్ని పొదిగినట్లు పొదిగాయి.

తావలచిన స్త్రీ తనకు చేసిన అన్యాయాన్ని చూసి ద్వేషించలేక, అలాగని ప్రేమించనూలేక, పోనీఅని, గతకాల సంబంధి అయిన స్నేహవల్లరిని పరిపోషించనూలేక, కొన్నాళ్ళు వేదనతోనూ నిరాశతోనూ అనిశ్చిత స్థితిలో సతమతమై, చివరకి హృదయాన్ని తేటపరుచుకొని, నిన్నటి వెలుగునూ రేపటి వేకువనూ తలచుకొని స్థిమితపడి జీవన రహస్యాన్ని కన్గొన్న తాత్త్వికసంపన్నుడుగా ఈ సానెట్స్‌లో మనకి కనిపించే షేక్స్పియర్, వెలుగు చీకట్ల పడుగు పేకలతో నిండిన జీవితాన్ని అద్భుత ప్రమోదాంత విషాదాంత నాటకాలలో ముందుముందు మనముందు ప్రదర్శించడానికి సర్వసమాయత్తమైన సమర్థుడుగా మనకి గోచరిసాడు.

## ది రేప్ ఆఫ్ ల్యుక్రీస్ :-

షేక్స్పియర్ వ్రాసిన 'వీనస్ అండ్ ఎడోనీస్', 'రేప్ ఆఫ్ ది ల్యుక్రీసు'లు, మిల్టన్ వ్రాసిన 'ఎలెగో' "ఇల్‌పెన్స్ రోసోలు"లు వలె, జంట కవితలు, పరస్పర విరుద్ధమైన ఇతివృత్తములూ, పాత్రలూ ఉండి ఒకదానికొకటి పరిపూరకాలుగా ఉండేలాగ వీటిని కవి వ్రాశాడా అనిపిస్తాయి. వీనస్‌లో ని పాత్రలూ, కథా, మానవాతీతమైనవి. ల్యుక్రీస్‌లో పాత్రలు తీవ్రమైన మానసిక సంఘర్షణలకి లోనుఅయినవి. ఇందులో కథ పూర్తిగా మానవ సంబంధమైనది. మొదటి కవితలో పురుషుని ప్రేమకోసం స్త్రీ ప్రాకులాడ్డం ఇతివృత్తమైతే, రెండవదాంట్లో పురుషుడు తన పశువాంఛకి స్త్రీని బలిచెయ్యడం ఇతివృత్తం. మేక్‌బెత్ దంపతులు హత్యచేసే, ది రేప్ ఆఫ్ ల్యుక్రీస్ అనే ఈ కవితలో టార్కిన్ అనే అతిథే, ఇంటి యజమానురాలయిన ల్యుక్రీస్‌కి అన్యాయంచేసి ఆమె మరణానికి కారణం అవుతాడు.

మొదటినుంచీ ల్యుక్రీస్ సౌజన్యమూర్తి, కాని టార్కిన్ తనని చెరచి తన శీలాన్ని అపహరించడం వల్ల అపరచండికగా మారుతుంది టార్కిన్‌ని చంపి కక్ష తీర్చుకుంటానని భర్త దగ్గరా తండ్రి దగ్గరా మాట తీసుకుని మరీ ఆత్మహత్య చేసుకుంటుంది.

నిద్రిస్తూన్న ల్యుక్రీస్‌ని షేక్స్పియర్ ఈ కవితలో వర్ణించిన తీరూ, తర్వాత 10, 12 సంవత్సరాలకి వ్రాసిన ఒథెలో, మేక్‌బెత్ నాటకంలో నిద్రిస్తూన్న వ్యక్తుల్ని వర్ణించేతీరూ, పరిశీలించి, ఈ మూడు సందర్భాలలోనూ వాడిన భాషనీ చేసిన భావననీ ఒకదానితో ఒకటి పోలిస్తే, కవిగా భావుకుడుగా ఆయనలో వచ్చిన క్రమ పరిణామం అర్థం అవుతుంది.

నిద్రిస్తూన్న ల్యుక్రీస్‌ని "Her lily hand her rose cheek lies under" అని వర్ణించాడు.

ఒథెలో, నిద్రపోతున్న డెస్డిమోనాని "Put out the light and then put out the light.. than flamining minister" అని వర్ణించాడు.

నిద్రిస్తూన్న డంకన్‌ని, లేడీ మేక్‌బెత్ "Had he not resembled my father as he slept, I had done it" అంటుంది.

బరువైన భావాన్ని సంక్షిప్తంగా చెప్పడం రాను రాను ఇలా నేర్చుకున్నాడాయన, చాసర్ విరచితమైన ఉత్తమ స్త్రీల గాథా, విలియమ్ పైంటర్ వ్రాసిన 'పేలస్ ఆఫ్ ప్లెజర్', ఓవిడ్ గ్రంథాలూ, ఇవిఅన్నీ ది రేప్ ఆఫ్ లుక్రీస్‌కి ఆధారాలయినట్లు కనిపిస్తాయి. టైటస్ నాటకంలో (2వ అంకం 1వ దృశ్యంలోనూ, 3 వ అంకం 1 వ దృశ్యం లో నూ) లుక్రీస్ కథకి సంబంధించిన ప్రస్తావన ఉంది. అంటే అప్పటికే ఈ కథ షేక్స్పియర్‌ని ఆకర్షించిదన్నమాట ఈ కవితని షేక్స్పియర్, నిజానికి ఒక చక్కని విషాదాంత శ్రవ్యకావ్యంగా మలచవచ్చు, కాని భావాలనీ సంఘటనలనీ అందంగా ఏర్చికూర్చి కరుణరస సృష్టి చేయలేక పోయాడు షేక్స్పియర్ అప్పటికింకా భాషా భేషజమేకాని, పరిణతి చెందిన విషాదాంత రచనలు చేయగల శక్తి తత్‌నిర్మాణ రహస్య సంగ్రహణ పారీణతా అలవడలేదు.

ఇతర కవితలు :

షేక్స్పియర్ వ్రాసిన ఇతర కవితలు ఇంకా 3 ఉన్నాయి ; అవి 1. లవర్స్ కంప్లైంట్ 2. పేషనెట్ పిల్‌గ్రిమ్ 3. ది ఫోనిక్స్ అండ్ టర్టిల్ అని కొందరు విమర్శకులంటే, అవి షేక్స్పియర్ రచనలు కానేకావు అని మరికొందరు విమర్శకులన్నారు. ఎవరి వాదన నిజమో ఇంకా నిర్ధారణ కావాలి.

ప్రియుడు తనపట్ల విముఖత చూపిస్తున్నాడని ఒక యువతి మొరపెట్టుకోవడం, లవర్స్ కంప్లైంట్ లో కథ కాగా, పేషనేట్ పిల్‌గ్రిమ్ ఒక ప్రేమగాథ.

ది ఫోనిక్స్ అండ్ టర్టిల్ అనే 67 పంక్తులు గల చిన్న కవితకి 20 వ శతాబ్దంలో ఎక్కువ ప్రశస్తి వచ్చింది. అందుకు కారణం రంజీ సహానీ. ఈ కవితలోని తాత్త్విక భావాన్ని రంజీ సహానీ 1931 లో విమర్శక ప్రపంచానికీ సాహితీ లోకానికీ అందించాడు అయితే ఈ కవిత షేక్స్పియర్ విరచితం కాదనీ, ఆయన సమకాలీనుడైన ఫ్లెచర్ ఇది రచించాడనీ రంజీ సహానీ అభిప్రాయం. "ఎంతటి శక్తిమంతమైన దానినయినా బలహీన మొనర్చి, ఎంతటి సౌందర్య స్వరూపాలున్నా వికారంగా మార్చివేయగల క్రూర శక్తి కాలం. కాని కాలం అనే ఆ క్రూర శక్తికి లొంగకుండా శాశ్వతంగా అజరామరంగా నిలిచేది అచ్చమైన ప్రేమ. ఈ సంగతిని ఫోనెక్స్ అనే ప్రకృతి, టర్టెల్ అనే పురుషుని, పరంగా సూచించి, వారి సంయోగానికి ఈ లోకం తగిన స్థలం కాదు కనుక అవి స్వర్గంలోనే కలుసుకుంటాయి అని తెల్పాడు రచయిత. ఒథెలో డెస్డిమోనాల ప్రేమా, రోమియో జూలియట్‌ల ప్రేమకూడా స్వర్గంలోనే ఫలించి పరాకాష్ఠనందుతాయి. ఆదర్శ ప్రేమికులు సత్య సుందరముల (Truth and Beauty) వంటివారు ఇంతటి మహోన్నతమైన భావాన్ని కవితలో మరెవరు చొప్పించగలరు? అందుకే ఇది నిశ్చయంగా షేక్స్పియర్ కవితే-అని విల్సన్ నైట్ తన Mutual Flame (1955) లో వివరించి చెప్పాడు.



# సాహిత్యగోష్ఠి

## అస్తిత్వవాదం – 3

అస్తిత్వవాదానికి చెందిన ఆచార్యులు దాదాపు పది పన్నెండు మంది వరకు ప్రముఖులున్నారు. వారిని గురించీ వారి రచనల్ని గురించీ సంక్షేపంగా కొంత తెలుసుకొనడం మంచిది. ఆ ఆచార్యుల్లో పాస్కల్, కిర్క్‌గార్డ్ డాస్టో వస్కీ. నిట్షే. రిల్కే. కాఫ్కా. సార్త్ర్, కామూ మొదలైన వారు చాలా ప్రసిద్ధి చెందినవారు.

### పాస్కల్ - 1

పాస్కల్ ఫ్రాంసు దేశవాసి. గణితజ్ఞుడు. కిర్క్‌గార్డ్ అస్తిత్వ వాద జనకుడని ప్రసిద్ధి గాంచినా ఆయన కంటే రెండు వందల సంవత్సరాలకు పూర్వమే పాస్కల్ అస్తిత్వవాదానికి అంకురార్పణ చేశాడు.

పాస్కల్ 1632 లో ఫ్రాంసులో జన్మించాడు. అతని మూడో సంవత్సరం వయస్సులోనే తల్లి మరణించింది. బాల్యం నుండి అతడిది రోగిష్ఠి శరీరం. కోరికవున్నా అతడు తన జీవిత సహచరిణిని ఎన్నుకొనలేదు. అతనికి వివాహం కాలేదు. చివరి వరకు విరాగిగా ఏకాంత జీవితం గడిపాడు. 31 సంవత్సరం వయస్సులో అతనికి ఒకానొక అంతరంగికానుభూతి కలిగింది. దానికి ఫలితంగా దార్శనికుల ఈశ్వరుణ్ణి వదలి అతడు బైబిలు ఈశ్వరుణ్ణి ఆశ్రయించాడు. చిన్న వయస్సులోనే, 1662 లో ఆయన మరణించాడు.

అంతరంగికానుభూతి కలిగిన తరువాత ఈశ్వరుని అనుగ్రహం మీద అతనికి సందేహ మేర్పడింది. ఆ విషయంలో చాలా ఉత్తరాలు వ్రాశాడు. అవి పాస్కల్ ఉత్తరాలు అనే పేరుతో పుస్తక రూపంలో ప్రచురింప బడ్డవి, విజ్ఞానం వలన మానవునికి మేలు కల్గదనే సంశయం ఆయనకు ఏర్పడింది. వైజ్ఞానిక పరిశోధన వలన మనుష్యుడు తన సహజ ధర్మాన్నుండి రోజు రోజుకూ చాలా దూరమయి పోతున్నాడని ఆయన కొక విశ్వాసం ఏర్పడింది. విజ్ఞానం కంటే ఆత్మ నశ్వరమా శాశ్వతమా, దాని ప్రకృతి ఏమిటి ? అనే దానిని తెలుసుకొనడం అవసరమని భావించి అనేకం క్రైస్తవ మత గ్రంథాలను అధ్యయనం చేశాడు. ఆ అధ్యయనం వలన ఆయనకు సంతృప్తి కరమైన సమాధానం లభించలేదు. నేను నాచిన్న జీవితాన్ని చూస్తున్నాను. అది అనంత దేశ కాలాల మధ్య చిన్న బిందువుగా ఉన్నది. ఈ అనంత దేశ కాలాలు నన్నెరగవు. నేను వాటిని ఎరగను. నేను అసలు ఇప్పుడున్న స్థానంలో ఎందుకున్నాను ? ఇంకొక స్థానంలో ఎందుకులేను ? నన్ను ఇక్కడికి తెచ్చి పడవేసిన శక్తి ఏది ? ఇదీ ఆయన జిజ్ఞాస, ఆ జిజ్ఞాసలోనే పాస్కల్ అస్తిత్వవాద దర్శనానికి బీజాలు నాటాడు. జ్ఞాన ప్రాప్తికి తర్కం కంటే శ్రద్ధ, విశ్వాసం ఎక్కువ ఉపయోగపడతాయని ఆయన నమ్మకం. ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేని దానిని శ్రద్ధ విశ్వాసాలద్వారా తెలుసుకొనగలమని గూడా ఆయన వివరించారు. మనుష్యుని అస్తిత్వాన్ని వస్తుగత బాహ్య దృష్టితో గాక ఆత్మగతమైన ఆంతరిక దృష్టితోనే గుర్తించగలమని ఆయన బోధించాడు. దానితోనే ఆ స్తిత్వవాదానికి అంకురార్పణ జరిగింది. ఏదైనా ఆయన ఆస్థావాది. అస్తిత్వవాదులలో ఈశ్వరవాదులూ, నిరీశ్వర వాదులూ ఇద్దరూ ఉన్నారు.

### కిర్క్‌గార్డ్ -2

కిర్క్‌గార్డ్ అస్తిత్వవాద జనకుడు. అస్తిత్వవాద దర్శనంలో కిర్క్‌గార్డ్ కున్న స్థానం అత్యున్నతమైనది. యూరపులో ప్రస్తుతమున్న అర్థంలో అస్తిత్వవాద శబ్దాన్ని ఉపయోగించివారు ఆయనే. అయితే విచిత్ర మేమంటే ఆయన జీవించివున్న కాలంలో అవాదానికి అంతప్రాముఖ్యం ఏర్పడ లేదు. ఆయన మరణించిన తరువాతనే ఆ వాదానికి

యూరపులో అత్యధిక ప్రచారం లభించింది. తరువాత తరువాత నిర్మాణమైన అస్తిత్వవాద సాహిత్యం మీద కిర్క్‌గార్డ్ ప్రభావం చాలా ఎక్కువగా కన్పిస్తున్నది.

కిర్క్‌గార్డ్ 1813 లో డెన్మార్క్‌లో జన్మించాడు. అతని తల్లిదండ్రులకు గల ఏడుగురు సంతానంలో అతనొకడు. అతని తండ్రి ఆధ్యాత్మికవాది. అయినా ఏదో బాధ వలన, దుఃఖం వలన ఈశ్వరుణ్ని తరచు నిందిస్తూ వుండేవాడు. అందువల్లనే నేమో కిర్క్‌గార్డ్ స్వభావం విచిత్రంగా మారింది. అతడు ఇతర ప్రాణికోటితో ఇతర వ్యక్తులతో తాదాత్మ్యాన్ని పొందలేకపోయినాడు అతడు చదువు కొంటున్న రోజుల్లోనే అతని సోదరులు, సోదరి, తల్లి మరణించారు. ఆ తరువాత కొద్ది రోజుల్లో తండ్రి గూడా మరణించాడు. 1840 లో రేగినా అనే యువతితో అతనికి వివాహం జరిగింది. అతడామెను ఎంతగానో ప్రేమించాడు. ఆమె తన హృదయరాణి అని అంటూ వుండేవాడు కాని ఒక్క సంవత్సర కాలంలోనే ఆ సంబంధం బెడిసి భార్యా భర్తలిద్దరూ వేరైనారు. అది ఆయన జీవితంలో పెద్ద మార్పును తెచ్చింది. ఆనాటి నుండి ఏకాంత జీవిగా మారి సాహిత్య వ్యాసంగంలో మునిగి రచనలు సాగించాడు చర్చి సేవలో చేరదామను కొన్నాడు. కాని చర్చి పేరుతో మతాధికారుల పేరుతో జరుగుతున్న పనులను చూచి ఏవగింపుతో తన అభిప్రాయాన్ని మార్చుకొన్నాడు. చర్చికీ మతాధికారులకూ వ్యతిరేకంగా తీవ్ర స్థాయిలో రచనలు చేశాడు. అందు వలన మతాధికారులు ఆయనను చాలా బాధ పెట్టారు. చాలా ఒత్తిడి కలిగించారు. ఆ వొత్తిడి వలన ఆరోగ్యం సరిగా లేకపోవడం వలన ఒక రోజు రోడ్డుమీదనే స్పృహతప్పి పడిపోయి 42 సంవత్సరాల వయస్సులో కిర్క్‌గార్డ్ పరమపదించాడు. అతని జీవితం అవ్యవస్థలో, అసంగత వాతావరణంలో, మతాధికారుల వొత్తిడిలో గడచింది ఆ ప్రభావం ఆయన రచనల్లో, ఆయన ప్రచారంలోకి తెచ్చిన దర్శనంలోగూడ మనం చూడగలము.

ఆయన దాదాపు 20 పుస్తకాలు డేనిష్‌భాషలోవ్రాశాడు. ఆభాష విశ్వవ్యాప్తమైనది కాదు. అందువలన ఆయన రచనల్ని గురించి డెన్మార్కులోతప్ప ఇతరదేశాలలో ఏమీ ప్రచారం జరగలేదు. ఆయన రచనలు ఇంగ్లీషులోకి అనువదింపబడిన తరువాతనే ఇతర ప్రపంచానికి ఆయనను గురించి తెలిసింది. ఆయన రచనలు ఆయన జీవితంచుట్టూ పరిభ్రమిస్తూ వుంటవి. 1. ఐదర్‌ఆర్, 2. ఫిలసాఫికల్ ఫ్రాగ్మెంట్స్ 3. కంక్లూడింగ్ అన్‌సైంటిఫిక్ పోష్టుస్క్రిప్ట్ 4. రెపిటిషన్ మొదలైనవి ఆయన ఉత్తమరచనలు. ఆయన తనరచనల్లో వ్యంగ్యాత్మకమైన శైలిలో హెగెల్ వాదాన్ని విమర్శించాడు. హెగెల్ ప్రతిపాదించినసిద్ధాంతాలు మానవుని ఉన్నతికి ఉపయోగపడవని ఆయన అభిప్రాయం. వస్తుగతమైన బాహ్యదృష్టితో మానవుని అస్తిత్వ అనస్తిత్వాలను గురించి పరిశీలన చేయడం సరిగాదని అయన నిశ్చితాభిప్రాయం విశ్వపటాన్ని చూపిస్తూ అందులో ఒక చిన్న బిందువుగా డెన్మార్క్‌నుచూపిస్తే డెన్మార్క్‌లో పర్యటన చేయదలచిన వాడికి అది ఏమాత్రమూ ఉపయోగపడదని అతనిభావం. హెగెల్ సిద్ధాంతం విశ్వపటం వంటిది. అందులో చిన్న బిందువుగా మాత్రమే మానవుని అస్తిత్వం చిత్రించబడివున్నదని కిర్క్‌గార్డ్ అభిప్రాయం. సత్యం ఆత్మనిష్ఠమైనది. అస్తిత్వమనేది ఘనీభూతమైన భావనా పరిధిలో నిండివుంటుంది. పూర్ణమైన దానిలో అస్తిత్వం ఒక అంశంగ భావించడం పొరపాటు. ఇదికిర్క్‌గార్డ్ అభిప్రాయం అతడు అస్తిత్వ సంపన్నుడైన వ్యక్తి నిశ్చితమైన లక్ష్యంతో తన అస్తిత్వాన్ని తాను వికసింపజేసుకొంటాడు. ఏవ్యక్తీ స్వయంగా క్రైస్తవుడు లేక ఇంకొకడు గాడు అతడు సాధనవలన క్రైస్తవుడవుతున్నాడు. సాధనచేసి తనజీవితాన్ని ఆమూసలో పోసి నిర్మించు కొంటున్నాడు. అన్నాడు. వస్తుగత చింతనా విధానం వలన సిద్ధాంతాలను చెప్పడం వినడం మాత్రమే జరుగుతుంది. సత్యదర్శనం కలగదు ఆత్మగత చింతనా విధానంలోనే సత్యదర్శనం, కలగడం సంభవమని ఆయన అభిప్రాయం. డెకార్టే నేను ఆలోచిస్తున్నాను. అందువలన నేనున్నానంటె కిర్క్‌గార్డ్ దానిని తలక్రిందులుచేసి "నేనున్నాను, అందువలన ఆలోచిస్తున్నా"నంటాడు. ఆలోచించడానికి నా అస్తిత్వం అవసరం. అస్తిత్వంలేనిది ఆలోచన లేదు అనంటాడాయన. మనం అంతర్ముఖులమై మన అస్తిత్వాన్ని గురించి ఆలోచించడం ప్రారంభించగానే మనలో ఎన్నో అంతర్విరోధం ఏర్పడుతున్నది. అ అంతర్విరోధాలకు తట్టుకోలేక ఈశ్వరుని సహాయం కోరుతున్నాము. తన ప్రయత్నం ఫలించక అసహాయస్థితి ఏర్పడినప్పుడు వివశుడై మనుష్యుడు భగవంతునివైపుకు పరుగెత్తుతున్నాడు. కిర్క్‌గార్డ్ ఆస్థా

వాది. అస్తిత్వానికి ఎంతో ప్రాముఖ్యమిచ్చినా పరమేశ్వరుడు ప్రేరకశక్తిగా మానవునిలో వున్నాడనీ, అతడు తర్కాతీతుడని గూడా అయన నమ్మిక. పైపై అడంబరాలనూ చర్చనీ. మతప్రబోధాలనూ ఆయనవ్యతిరేకించినా, తీవ్రంగా విమర్శించినా ఈశ్వరశక్తిమీద ఆయనకు విశ్వాసమున్నది. ఇది ఆయన వాదంలోని బలహీనత అనీ, జీవితపథంలో పయనిస్తూ ఈశ్వరుని శక్తిపై ఆధారపడటం మానవుని నిష్క్రియతను సూచిస్తుందనీ తరువాత అచార్యులు అభిప్రాయం వెల్లడించారు. ఏమైనా ఈనాడు ఏ అర్థంలో అస్తిత్వవాదమనేది వ్యాప్తిలో ఉన్నదో ఆ అర్థాన్ని సృష్టించినవాడు, ఆ అర్థంలో దాన్ని ప్రచారం చేసినవాడు కిర్క్‌గార్డ్. ఆయన అస్తిత్వవాద దర్శన జనకుడు. ఒక అచార్య పురుషుడు.

## జీన్. పాల్ సార్త్రే

అస్తిత్వవాద దార్శనికులలో జీన్ పాల్ సార్త్రె పేరు చాలా ప్రఖ్యాతమైనది. అస్తిత్వవాదమంటే సార్త్రె, సార్త్రె అంటే అస్తిత్వవాద మని చెప్పవచ్చును. అధునాతన జీవితాన్నీ, ఆధునిక కళలనూ వ్యాఖ్యానించడానికి అస్తిత్వవాద దర్శనం ఒక్కటే సమర్థవంతమైన దన్నంతగా సార్త్రె ఆవాదాన్ని ప్రచారంలోకి తీసుకొని వచ్చాడు ఆధునిక ఫ్రాంసుకు ఆయన దార్శనిక ప్రతినిధి అనవచ్చును. జర్మనీలో జాస్పర్స్ ప్రయత్న ఫలితంగా అస్తిత్వవాద దర్శనం వ్యాప్తి చెందింది. కాని సార్త్రె ముందు అది నిలవలేని స్థితి ఏర్పడింది. దానికి కారణం సార్త్రె గొప్ప సాహితీ నిర్మాత, కళాకారుడు కావడమేనని చెప్ప వచ్చును. ప్రపంచంలోని బహు సంఖ్యాకులు సార్త్రెను కళాకారుడుగా ఎరుగుదురు. ఎంత ప్రసిద్ధి ఆయనకు సాహితీ జగత్తులో లభించిందో అంతగా పొరపాటు అభిప్రాయాలు గూడా అయనను గురించి వ్యాప్తిలోకి వచ్చినవి. ఇంగ్లీషుమాట్లాడే దేశాల వారు ఆయనను పాంప్లిటియర్ అన్నారు.

సార్త్రె 1905 లో జన్మించాడు. మొన్న మొన్ననే మరణించాడు. అతని రెండు సంవత్సరాల వయస్సులోనే అతని తండ్రి మరణించాడు. సార్త్రె పదకొండవ ఏట అతని తల్లి రెండో పెళ్ళి జేసుకొన్నది. అ తరువాత అతని జీవితం పుస్తక పఠనంలో గడచింది. అతడు ఏకాంత వాసిగా, వ్యక్తివాదిగా మారాడు. స్కూలు మాష్టరుగా జీవితం ప్రారంభించి అతడు సైన్యంలో చేరాడు. ఒక సంవత్సరం జైలులో వున్నాడు. అనారోగ్య కారణంగా అతడు జైలు నుండి విడుదలయినాడు. సార్త్రె వ్యాప్తిలోకి తెచ్చిన అస్తిత్వవాదాన్ని ఆకళింపు చేసుకొనవలె నంటే ఆయన వ్రాసిన బీయింగ్ అండ్ నథింగ్‌నెస్, ఎగ్జిస్టెంషియాలిజం అండ్ హ్యూమనిజం. సిచ్యుయేషన్స్. వాట్ ఈజ్ లిటరేచర్ మొదలైన పుస్తకాలు ఉపయోగపడ గలవు. ఆయన నోబుల్ బహుమతిని తిరస్కరించాడు.

రెండో విశ్వయుద్ధం జరిగినప్పుడు అతడు విశ్వసామ్యవాదం వైపుకు ఆకర్షితుడైనాడు. కాని మాస్కో నేతృత్వంలో నడచిన ఆ ఉద్యమ మంటే విసిగి పోయాడు. 1968 తరువాత అతడు హింసాత్మక విప్లవాన్ని సమర్థించడం ఆరంభించాడు.

జీవితం కటుత్వం అసంగతులు, నిరాశల మధ్య ఊగులాడుతూ వుంటుందనీ. అందులో జన్మించిన వైషమ్యాల వలన వ్యక్తి తన కోరికలను పూర్తి చేసుకొన లేక పోతున్నాడనీ, అందువల్ల ఈశ్వరుని వైపుకు పరుగెత్తుతున్నాడనీ అంటూ. వ్యక్తికి తన జీవితంలో తన ప్రయత్న ఫలితంగా ఫలప్రాప్తి కలగకపోతే ఈశ్వరుడు అతనికి ఎట్లా ఫలప్రాప్తి కలుగ జేస్తాడు. అర్థం కావడం లేదన్నాడు. సార్త్రె ఆస్థావాదికాడు. ఈశ్వరవాది కాడు. అతడు చేతనవాది. చేతన వస్తువులో వుంటుంది. వస్తువు చేతనలో లేదు. అద్దంలో వస్తువు వుండదు. కాని దానికి దగ్గరగా వున్న వస్తువు ఆ అద్దంలో ప్రతి బింబిస్తుంటుంది. ఇది ఒక ఉదాహరణ ఒక పుస్తకమున్నట్లు చేతన వున్నది. ఆ పుస్తకం వున్నచోటు చేతనలో లేదు. ఇది ఇంకొక ఉదాహరణ చేతన, వస్తువు అనే ద్వైత్వాన్ని సార్త్రె అంగీకరిస్తాడు. వ్యక్తిగత స్వాతంత్ర్యానికి సార్త్రె చాలా ప్రాధాన్యాన్నిస్తాడు. స్వాతంత్ర్యమనేది భూతవర్తమానాలు రెండింటి నుండివిముక్తమై తన ఉద్దేశ్యాలనూ లక్ష్యాలనూ నిర్మించు కొంటుంది. అంటాడు. సార్త్రె ఈశ్వర శక్తిని పూర్తిగా నిరాకరించాడు. మానవుడే మానవ మూల్య నిర్మాత అని ఉద్ఘాటించాడు. స్వాతంత్ర్యం మనుష్యుని జన్మసిద్ధ అధికారమన్నాడు. సార్త్రె అభిప్రాయం ప్రకారం మనుష్యునికి గల స్వాతంత్ర్యం బాధ్యతతో కూడుకొని వుంటుంది. ఆ బాధ్యత వ్యక్తిగతమే గాక సమాజగతం గూడాను. మనుష్యుని అస్తిత్వం, నేను జగత్తులో ఒక భాగంగా వున్నాననే దాని చేత అను శాసితమవుతుంది.

శరీరం ఒక స్థూల కేంద్రం. అది ఒక ఆరంభ బిందువు. దాని సహాయంతో మనుష్యుడు ముందుకు సాగడానికి ప్రయత్నించాలి. అంటాడు. సార్త్ర్. సార్త్ర్ గొప్ప సాహితీ నిర్మాత. మహా వ్యక్తులలో ఒకడు.

**వే. ఆంజనేయశర్మ**

# నేతాజీ సుభాస్ చంద్రబోస్ వ్యక్తిత్వంపై ప్రముఖుల ప్రభావాలు

నేతాజీ సుభాస్ చంద్రబోసు బాల్యంనుంచే ఉన్నతాశయములు గలవాడు. ఆదర్శజీవి. అంతర్ముఖుడు. ఈడుకు మించిన బుద్ధి గలవాడు. అసలు ఆయన మానసిక జగత్తులోనే ఏదో అసాధారణత్వం ఉండేది. ఆయన చదువుకున్న పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఆయనలో అంత చిన్నతనంలోనే నైతికమైనవిలువపట్ల ఆలోచనలు రేకెత్తించాడు. సమాజంలో ఒక మనిషిఅంతస్తు ఎట్టిదైనా, అదిముఖ్యం కాదు. అసలు బంగారం మానవుడే. ప్రకృతిని ప్రేమించమనీ ప్రకృతిని సౌందర్యారాధన దృష్టితోనేకాక సుగుణాల దృష్ట్యా కూడా చూడమనీ ఆ ఉపాధ్యాయుడు చెప్పాడు. ఆయన చెప్పినట్లే బోసు నిర్జన ప్రదేశమైన పచ్చిక బయలులో అస్తమిస్తూ ఉన్న సూర్యుని కిరణాల కాంతిలో ఒక్కడే కూర్చొని ధ్యానసాధన చేసాడు. దానివల్ల ఆయనకు మనశ్శాంతి, ఆనందం, సంకల్పబలం, సిద్ధించాయి.

బోసుకు మొదటినుంచీ ఐహిక జీవితమన్నా ప్రాపంచిక తాపత్రయాలన్నా ఆకర్షణ లేదు. అవి అంటేనే ఆయన తత్త్వం ఎదురు తిరిగేది. కౌమారదశలో లైంగిక వాంఛలు పొటమరించినప్పుడు వాటిని ఎప్పటికప్పుడు అణచివేసుకుంటూ, వాంఛకు లొంగకుండా అతీతంగా ఉంటూ వచ్చాడు. తన జీవితానికి ఒక ఆశయమంటూ ఉంటే మంచిది. దానికి తన జీవితాన్ని ముడివేసి. మనస్సు పరిపరివిధాల పోకుండా, స్థిరమైననడవడితో జీవించవచ్చు అని అనుకున్నాడు. కాని అదెటువంటి ఆశయమో ఆయనకే తెలియదు. అయినా దానికోసం అన్వేషించటం మానలేదు.

ఆ స్థితిలో ఆయన భావనాలోకంలోకి వివేకానందుడు ప్రవేశించాడు. అప్పుడు బోసు వయస్సు పదిహేను. వివేకానందుని గ్రంథాలను వరుసగా చదువుకుంటూ పోయాడు. ఆయనకు అంధకారంలో వెలుగు ప్రసరించినట్లయింది. తన జీవితం యావత్తునూ అర్పించుకోగల ఒకానొక ఉదాత్తలక్ష్యాన్ని వివేకానందుడు చూపించినట్లనిపించింది. మనిషి నిలువెల్లా పులకరించి పోయాడు. ఆత్మనో మోక్షార్థం జగద్ధితైషి— నీ మోక్షంకోసం, మానవాళికి సేవకోసం జీవించు, అదే నీ జీవితలక్ష్యం కావాలి. అని వివేకానందుని ప్రబోధం. ఆ సూక్తి బోసుకు ప్రేరణ కలిగించింది. ఆయనను ఉత్తేజపరిచింది. మధ్యయుగాలలో లోకాన్ని పరిత్యజించి సన్యాసత్వం స్వీకరించి. ఏమతం లోనో పోయిఉండమని చెప్పేవారు. ఆధునిక యుగంలో పనులు ఉపయోగకరమైనవి కాబట్టి ఉపయోగితావాదము శిరోధార్యమని పాశ్చాత్య మేధావులైన బెంథామ్. మిల్ వంటివారు అన్నారు. కాని బోసుకు అవి రెండూ సమగ్రమూ, పరిపూర్ణమూ అయిన ఆదర్శాలుగా తోచలేదు. 'సోదరులారా ! అన్నార్తులూ అనాథులూ అయిన భారతీయులు మీ సోదరులని చెప్పండి. శక్తి, దార్ఢ్యము-ఉపనిషత్తుల బోధల సారాంశము ఇదే' అని వివేకానందుడు దేశీయులకు హితబోధ చేశాడు. మానవాళికి సేవ అంటే అందులో దేశసేవ కూడా ఇమిడి ఉన్నదని బోసు అన్వయము చెప్పుకున్నాడు. ఆయన మనస్సును కలచివేసిన ప్రశ్నల కెన్నిటికో సంతృప్తికరమైన సమాధానం లభించినట్లు సంతుష్టాంతరంగు డయ్యాడు.

ఆ తరువాత బోసు రామకృష్ణ పరమహంస వ్యక్తిత్వాన్ని గూర్చి చాలా ఆలోచించాడు. ఆయన చదువుకోని వాడి క్రింద లెక్క. కాని తన జీవితాన్ని గూర్చి మహా మహులు శ్రద్ధాభక్తులతో చింతన చేసే విధంగా ఆయన జీవించాడు. సత్శీలము, ఆధ్యాత్మిక చింతన మున్నగు విషయాలలో సాధకులకు దారిచూపాడు. తన బోధలను తానే ఆచరణలో పెట్టి చూపాడు. కామమునూ, బంగారమునూ త్యజించమన్నాడు రామకృష్ణుని బోధనలు బోసు పరిత్యాగబుద్ధికి మరింత పదును పెట్టాయి. ఆయన కొక నూతనాదర్శం ప్రత్యక్షమైంది. 'నాకు నేనే విమోచనం కలిగించుకోవాలి. ప్రాపంచిక వాంఛలను విసర్జించి, అనుచితమైన అంశలను ఛేదించుకొని పోయి మానవాళికి సేవ చేయాలి' అన్న వజ్రసంకల్పం ఆయనకు కలిగింది,

బోసు కళాశాలలో చేరాడు. అక్కడ ఆయన కొందరు సాటి విద్యార్థులను ఒక జట్టుగా చేర్చుకొని దానికి నవ వివేకానంద బృందము అని పేరు పెట్టి, మతానికీ, జాతీయతా భావానికీ సంయోగము సమకూర్చ ప్రయత్నించాడు. ఈ జట్టువారిని ఆధ్యాత్మిక చింతన, సంఘసేవ అధికంగా ఆకర్షించాయి. సంఘసేవ అంటే బోసు దృష్టిలో జాతీయ పునర్నిర్మాణం. బోసు ఆ బృందం వారితో కలిసి కలరా మున్నగు వ్యాధులకు గురి అయిన వారికి సేవ చేసే నిమిత్తం పరిసర గ్రామాలకు వెళ్ళి వస్తూ ఉండేవాడు. కలకత్తా నగరంలోనే పేదప్రజలుండే పేటలకు వెళ్ళి పారిశుధ్యపు పని చేసేవాడు. అట్లా వెళ్ళి సేవ చేసినప్పుడు తన కుటుంబం వారెవరూ తనను చూడకుండా బోసు జాగ్రత్త పడేవాడు. తల్లిదండ్రులకూ, కుటుంబంలోని పెద్దలకూ బోసు ఆ విధంగా తిరిగి కాలం వ్యర్థపుచ్చడం ఇష్టం లేదు. బోసు బృందం వారు కాషాయ వస్త్రాలు ధరించి సన్యాసుల వలె కొంత కాలం తిరిగారు. బోసు కాశీ, హరిద్వారం హృషీకేశం, మధుర, బృందావనం మున్నగు ప్రదేశాలకు వెళ్ళి ఎందరో సాధువులను చూచాడు. ఆయనకు ఎక్కువగా సన్యాసులూ, డబ్బు కోసం యాత్రికులను పీడించే పండాలూ తటస్థపడ్డారు. ఒకచోట మాత్రం ఒక సన్యాసి ఈ లోకంతో తనకు సంబంధం లేనట్లు ధ్యానమగ్నుడై కన్పించాడు. ఆయన ఎవరినీ ఏమీ అడగడు. ఎవరైనా పండ్లు పెట్టితే మితంగా భుజించేవాడు. డబ్బు స్వీకరించేవాడు కాడు. ఆయన బోసును చాలా ఆకర్షించాడు. నిజమైనసన్యాసి అతడేనేమో !

సుభాస్ చంద్రబోసుకు లోకమాన్య బాలగంగాధర తిలక్ పెద్దన్నయ్య అరవింద్ ఘోష్ చిన్నన్నయ్య. వీరిద్దరూ కూడా అటు ఆధ్యాత్మిక విషయాలలో ఇటు రాజకీయాలలో సాధన చేశారు. ఇద్దరూ మహాపండితులు. ముఖ్యంగా అరవిందుడు ఒకవంక ఆధ్యాత్మిక చింతనలో మరొక వంక దేశాన్ని పరదాస్యంనుండి విముక్తంచేసే కృషిలో పాల్గొని దార్శనికుడైన యోగిగా తత్త్వవేత్తగా భారతీయులను ఆకర్షించాడు 19 2 నాటికే ఆయనలోక విఖ్యాతుడయ్యాడు. ఆయన పాండిచేరి వెళ్ళి ఆశ్రమవాసి అయినా మళ్ళీ బెంగాలు తిరిగివచ్చి దేశస్వాతంత్ర్య సమరానికి నాయకత్వం వహిస్తాడని ప్రజలు పలువిధాలుగా చెప్పుకునేవారట ఆయన వల్ల రాజకీయ విమోచనం సిద్ధిస్తుందని ప్రజలు నిశ్వసించేవారట. ఒకవ్యక్తిని గూర్చి [illegible] చెప్పుకోవడం చూచిన సుభాస్‌చంద్రబోసు అరవిందుడు రచనలు చదివాడు. అరవిందుడు ప్రతిపాదించిన యోగసమన్వయం, దివ్యజీవనం, అనేతాత్విక సిద్ధాంతాలు బోసును చాలా ఆకర్షించాయి. కళాశాలలో ఆంగ్లేయులైన ఆచార్యులు కొందరితో బోసు ఘర్షణ పడ్డాడు. ఆత్మాభిమానం కోసంధీరుడై నిలిచాడు. విచారణలో సాక్షిగా సత్యాన్ని ఏకరువు పెట్టినందుకు ఆయనను కళాశాల నుండి రస్టికేట్ చేశారు. ఎట్లాగో పట్టభద్ర పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు.

కుమారుని విద్యార్థి జీవితంలోని ఒడిదుడుకులను ప్రసిద్ధన్యాయవాదియైన తండ్రి గమనిస్తూనే ఉన్నాడు. ఆకస్మికంగా ఒక నిర్ణయం తీసుకొని సుభాస్‌ను ఐ.సి.ఎస్. పరీక్షకు చదవడానికై ఇంగ్లండు పంపించాడు. వెళ్ళనని బోసు అనలేదు. వెళ్ళి ఉన్న కొద్ది వ్యవధిలోనే అన్ని పాఠ్య విషయాలు అధ్యయనంచేసి ఐ. సి. యస్. పరీక్షలో నెగ్గాడు. ఇండియన్ సివిల్ సర్వీస్ కవినెంట్‌పై సంతకం చేశాడంటే భారతదేశంలో ఉన్నతోద్యోగంలో ప్రవేశించి సుఖజీవనం గడపవచ్చు. కానీ విదేశీ ప్రభుత్వపు ఉద్యోగంలో చేరడమా అని అంతరాత్మ ప్రశ్నించింది. వివేకానందుడు, రామకృష్ణుడు, అరవిందుడు తనకుచూపిన ఆదర్శాలమాట ఏమిటి ? రాజీపడడం అనేదిలేనట్టి ఆదర్శవాదంవల్లనే జాతి నిర్మింపబడుతుంది. "ఒక ప్రభుత్వాన్ని అంతమొందించాలంటే దానినుంచి ఉపసంహరించుకోవడం ఉత్తమమైనపద్ధతి. అది టాల్‌స్టాయి చెప్పిన సిద్ధాంతమని కాదు. అలాగేగాంధీ బోధించాడనీకాదు నాకే అందులో విశ్వాసం కలిగింది'' అంటూ, తన తల్లిదండ్రులు తన ఈ తిరుగులేని నిర్ణయం వల్ల మనఃక్లేశం పొందుతారని తెలిసి ఉండి కూడా లండనులో అక్కడికక్కడే ఐ. సి. యస్. నుంచి రాజీనామా చేసి బోసు భారతదేశానికి తిరిగివచ్చాడు. ఇది 1921 నాటి మాట! ఆ తర్వాత ఆయన జాతీయోద్యమంలో దూకడమూ, తన సర్వస్వమూ త్యాగం చేయడమూ, బ్రిటిషు వారిని ఎదుర్కొనడానికై స్వదేశం విడిచి రహస్యంగా వెళ్ళిపోవడమూ, స్వతంత్ర భారత సేనను నిర్మించడమూ, నేతాజీగా చరిత్ర కెక్కడమూ అంతా తరువాతి చరిత్ర. అంతటి త్యాగి పుట్టిన దేశం ఇది!

డి. రామలింగం

H. No. 1-8-726/30 Nallakunta,
Hyderabad-44

# వస్తువిన్యాస వైఖరి

భక్తి గొప్పదా? సర్వాధికార శక్తి గొప్పదా? అన్న ప్రశ్న చిరంతనంగా ఉన్నదే. ఆ ప్రశ్న మీద మొలచినవే 'శ్రీ రామాంజనేయ యుద్ధం' 'శ్రీ కృష్ణార్జున యుద్ధం' మొదలైన పౌరాణిక గాథలు. సమాధానం కూడా సహృదయ వేద్యమే.

ఇలా ప్రబలాలైన భక్తిశక్తులు రెంటినీ సంసేవించే సంప్రదాయాలు కూడా సనాతనంగానే ఉన్నాయి లోకంలో వాటిలో భగవద్భక్తి కన్నా భాగవత ప్రపత్తికే పెద్దపీట వేసే సంప్రదాయం 'విశిష్టాద్వైతం'.

'శ్రీకృష్ణ చరిత్ర' లోని వస్తువు 'కృష్ణమాచార్య చరితం కాదు— విశిష్టాద్వైత తత్వసారమైన 'ప్రపత్తి యోగం' ఆ తత్వాన్ని, ప్రస్తుత కావ్యకథారూపంలో ప్రస్తరించిన ప్రముఖ విమర్శకులు డా. యం. కులశేఖరరావు గారి 'భాగవత నిష్ఠ' ఆ కథకు ప్రాణం.

సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యాలు — విశిష్టాద్వైతి సాధింపజూచే చతుర్విధ ముక్తి దశలు. వాటిలో మూడవదైన 'సారూప్యశక్తి' భక్తుడైన కృష్ణమాచార్యులను కృష్ణునిగానే మార్చివేసింది కాబట్టే ఈ కావ్యం 'శ్రీకృష్ణ చరిత్ర'.

'కృష్ణుడే నేటికి కృష్ణమాచార్య
వైష్ణవరూపము వహియించె నంద్రుడు' —పుట. 8.

అన్న కవివాక్కు—పై దృష్టితో వెలువడిందే. విశ్వ వ్యాప్తేతి విష్ణుః— అన్న భావం మీది తద్ధితదశ 'వైష్ణవం' అది తద్ధితం కాబట్టి— తద్విష్ణువు విశ్వవ్యాపి కాబట్టి వైష్ణవ సంకల్పం. సజ్జనలోకాల చీకాకులను పోకారిస్తుంది నాలుగు లక్షల సింహగిరి వచనాలు చెప్పిన

'కృష్ణమాచార్యుల కృతులు లోకాన
వైష్ణవ భక్తుల వెతలు బోగొట్టె'. — పుట. 18.

అని ప్రవచించడంలో అతిశయోక్తి ఏమున్నది? సాకృతి వహించిన ప్రపత్తి యోగమే కృష్ణమాచార్యులు కాబటి.

'కృష్ణమాచార్యులే కృష్ణభక్తుండు
కృష్ణమాచార్యులే విష్ణురూపుండు' —పుట 52.

అంతటి అధికారం ఆయన కున్నది కనుకనే ప్రతాప రుద్రుని సభలో 'రాచసుంకం' కోసం ప్రశ్నితుడైన కృష్ణమాచార్యులు—

'నాకైన యవమాన మీకు కాదయ్య?
నాకైన గౌరవాల్ మీకు కాదయ్య?' —పుట 49.

అంటూ సర్వాంతర్యామిని నిలదీయగలిగినాడు.

ఇలాంటి కృష్ణమాచార్యులు 'వర్గరాహిత్యుండు—వరదుడు—సమ్మాన్యుడు—ఋగ్వేదవిదుడు' (పుట. 7.) ఆయన మీద పెట్టి 'వైష్ణవ ప్రపత్తియోగ శక్తి' ని కావ్యరూపంగ ప్రకటిస్తున్నారు డా. యా. కులశేఖరరావు గారు. కాబట్టి 'శ్రీకృష్ణచరిత్ర' లోని వస్తువిన్యాస కార్యక్రమం అంతంత మాత్రంగా అమరిపోయింది కాదు. ఆ బరువు మోసిన అలసటే కావ్యాంతంలో—

'కులశేఖరుడు తన గురువుల కృపను
వెలయింపజేసె నీ వెన్నుని లీల'—పుట 52.

అనిపించింది అప్రయత్నంగా కవినోట.

'అనుకూల్య కరణం— ప్రాతికూల్య విసర్జనం—గోప్తృ వరణం—దృఢధ్యావసాయం— ఆకించిన్యత్వం—భరన్యాసః' అనే షడంగాలతో విలసిల్లే 'ప్రపత్తి' అన్న వస్తువును; దానికి పుమాకృతి ఐన కృష్ణమాచార్యుల చరిత్రను సంప్రదాయ బద్ధంగా తురీయ పురుషార్థమైన మోక్షాభిముఖంగా విన్యసించారు డా. రావుగారు.

'వచనము లెన్నియో వచియించివాడ
లక్షలు నాలుగు లక్ష్యమ్ము నాకు'. —పుట 12.

అన్న కృష్ణమాచార్యుల మాట-అనుకూల్య కరణం.

.. .దేవదాసి 'మోహిని' కి వశుడై . . . . .

'భక్తి ఏమాయెనో భక్తులేమైరో
రక్తికి గురియయ్యె రామను వలచి' పుట 26.

అన్న స్థితిలో కామానికి;

రామానుజునితో—

'మునిరాజ! నీవేమీ మూర్ఖుడవౌదె?
వెన్నుడు దయనాకు వైకుంఠమీడ?' —పుట 37.

అనే గతిలో క్రోధానికి లొంగిపోయి ప్రతికూలపద్ధతిలో

ప్రవర్తించినా తర్వాత కలిగిన అనుభవాలతో

''కామము పోయెను గర్వముపోయె
నేమమ్ముతో నేను నీ మాట వినగ'' —పుట 42.

అని ఆచార్యులవారు యతిరాజులకు విన్నవించడం ప్రాతికూల్య విసర్జనం,

విశిష్టాద్వైత సంప్రదాయంలో భగవద్భాగవతాచార్య ప్రపత్తులు ఉత్తరోత్తర బలీయాలు, వైష్ణవులు స్వాచార్యున కిచ్చిన ప్రాధాన్యత భగవంతునికీయరు.

పరమ ప్రసన్నుడైన కృష్ణమాచార్యులు—

"భగబత్ స్వరూపాన భాష్యకారులుగ
వేగము నాముందు వెలసియున్నారు
దాసుని రక్షింపు దాక్షిణ్యమూర్తి" —పుట. 42.

అని జగదార్యులకు ''శరణాగతి'' చేయడం ''గోప్తృ వరణం''

'కనిగిరి' అధికారిగా ఉంటూ రాజదండన కూడా లక్షింపక ప్రభుధనాన్ని, వెచ్చించి రాగిరేకులమీద వచనాలు చెక్కించిన కృష్ణమాచార్యులు నిండుసభలో ప్రతాపరుద్రుని చేత ప్రశ్నింపబడి—

"ధనమునీయదికాదు ద్రవ్యమాయనదె
ధనము మాకేలయ్య ధనపతి తానె.
పన్నులు పంపించు పని చూడ లేదు
వెన్నుని నుతితోడ నున్న కతాన' —పుట 48.

అంటూ పలికకే ఎదురుచెప్పడం 'దృఢాధ్యవసాయం'

రామానుజ దర్శనార్థియై వాకిట నిలిచిన కృష్ణమాచార్యులు—

'చేరదాసుడు వచ్చె చెప్పు' —పుట 40.

అని శిష్యునితో చెప్పడం 'ఆకించిన్యత్వం'.

కావ్యాంతంలో— కనకవర్షం కురిపించిన కృష్ణమాచార్యులు ప్రతాపరుద్రునికి పరాత్పర వైభవాన్ని ప్రబోధిస్తూ—

'విశ్వమోహను మీద విశ్వాసమున్న
నాశము లేదయ్య నరులకు నెపుడు' —పుట 51.

అనడం 'భరన్యాసం'.

ఇలా సర్వాంగీణమైన ప్రపత్తియోగంతో జీవితం గడిపిన కృష్ణమాచార్యుల 'వచన రచన' అనే ధర్మం. 'అర్థ కామాలను' తన కైవసం చేసుకొని 'మోక్ష' గామిత్వంతో పురోగమించింది. వట్టి నడకే కాక పరీక్షా ఘట్టంలో—

'ముక్తి నాకికలేదు మోక్షమ్ములేదు
భక్తుడనైనట్టి ఫలితమే లేదు. పుట 37.

అంటూ ఆచార్యులచేత 'ఆర్తనాదం' చేయించింది. కాబట్టి ధర్మార్థకామ గుణకమైన త్రివర్గం—మూటికి మూడు త్రోవలుగా చీలిపోక— త్రికరణశుద్ధితో — అపవర్గమైన మోక్షఫలాన్ని సాధించింది. అలా ఇటు చతుర్విధ పురుషార్థాలూ, అటు షడంగశోభిత ప్రపత్తియోగమూ కృష్ణమాచార్యుల వ్యక్తిత్వాన్ని మహామహిమాన్వితం చేశాయి. ఆ మహావస్తువును సంప్రదాయ కళాసహితంగా చేసింది. డా. రావుగారి ప్రతిభ.

భక్తికావ్యాల్లో దశావతారవర్ణన అనూచానంగా కవిలోకం ఆచరిస్తున్నది. సంప్రదాయానురక్తులైన ఈ కవి కూడా—

"మత్స్య రూపుడయ్య మాధవదేవ
అంటూ ప్రారంభించి
"మంగళంబగు నీకు మంగళరూప" —పుట. 48.

అంటూ అభివర్ణించి. ప్రసిద్ధమైన పెరియాళ్వార్ (విష్ణుచిత్తు)ల "పల్లాండు పల్లాండు'' 'మంగళశాసన' పద్ధతిలో ముగించారు.

వస్తువిన్యాసం మంగళప్రారంభమై మంగళమధ్యమై మంగళాంతమై ఉండాలని ఆలంకారికుల అనుశాసనం. దాన్ని అక్షరాలా పాటించడమే కాక— కృష్ణమాచార్యులు ఎదురు దెబ్బలుతిన్న ఘట్టాలకుకూడా— అశుభవాసన లేకుండా— అన్ని ఆశ్వాసాలకూ "అవతరణము—పరిణయము— మోహనము — జ్ఞానము—సాయుజ్యము" అని పేర్లు పెట్టడం కవిలోని సర్వశుభకర దృష్టికి తార్కాణం.

ఇల్లాంటి వస్తువిన్యాస సౌందర్యంతో పాటు — మానవతావాదం, భావకవిత్వ లక్షణం మొదలైనవి కూడా ఈ కావ్యంలో ఉన్నాయి.

'కోకిలనాదాలు కొమ్మలమీద
బాకాల నూదిన పగిదిని దోచె' పుట 23.

వంటి గిలిగింత కలిగించే కవితా ఖండాలతో పాటు—

'చూచెడువారలు చౌద్యమ్మునంది
పూచిన చెంగల్వ పూదోట గాగ' పుట 25.

వంటి ప్రౌఢ ధ్వనిబంధాలూ ఉన్నాయి. నేటి రచనా రంగంలో 'నవ్యత–మానవతా వాదం–సామ్యవాదం–సామాజిక స్పృహ–ప్రతీకాత్మకత–విప్లవం– మొదలైన నినాదాలతో బాటు; 'సంప్రదాయ కవిత' అభ్యుదయానికి పనికిరాదన్న వాదం కూడా ప్రబలంగా ఉన్నది. ఏది నవ్యత ? ఏది అభ్యుదయం ? అన్న రెండు ప్రశ్నలను సమాధానించుకోవడంలో వచ్చిన భేదమే నాటి నేటి కవి పండితులకు వైమనస్యాన్ని సృష్టిస్తున్నది. ఇది తొలిగిపోతే బహుశా 'సంప్రదాయ కవిత' పనికిరాదన్న వాదం అంతరిస్తుందేమో! మేఘసందేశంలో ప్రతీకాత్మకత–నక్కీరుని కథలో నైతిక విప్లవం– జాబాలిలో మానవతా వాదం– కురుసభలోని వికర్ణుని తిరుగుబాటులో సామ్యవాదం–సీతా పరిత్యాగంలో సామాజిక స్పృహ లేదా ? నాడైనా నేడైనా కవితచేసేపని పనిలోకవృత్తానుకరణమే. నాటికీ నేటికీ కవితకు మూలం మనోమథనమే. అప్పుడూ ఇప్పుడూ కవితా ప్రయోజనాలు ఆనందోపదేశాలే. ఐతే కవిలోకంలో ఇంతటివైవిధ్యం ఎందుకు వచ్చిందన్నది ప్రశ్న. అభివ్యక్తి మార్గం విభిన్నమైనంతమాత్రాన కవితాప్రయోజనం, కవిత్వస్వరూపం మారుతుందా ? అని కూడా ప్రశ్న. వీటికి జవాబు నేడు బహుముఖంగా వినిపించే 'నవ్యత'– అన్న నినాదం. సమాజం భౌతికంగా మారిఉండవచ్చు. ఐనంతమాత్రాన వ్యక్తి మానసికవృత్తుల్లో భేదమేదైన ఉన్నదా ? జీవలక్షణాల్లో మార్పేమైనా ఉన్నదా ? ఇలాంటిలోకాన్నే, చిత్రిస్తూకూడా అనాదిగా కవులు "అనునవ్యకావ్యాలు" సృష్టించడం చూస్తుంటే– "వస్తువిన్యాసవైఖరి"లోని కొత్తదనమే నిజమైన నవ్యతకాని, అభావం "కావాలని" కాదని నిర్ణయించవచ్చు.

ఇవన్నీ పర్యాలోచించే—

"నవ్యమే యైనంత కావ్యమ్ము కాదు
నవ్యమేదైనను కావ్యమ్ము సుమ్ము" పుట. 3.

అంటున్నారు డా. రావుగారు. నవ్యమంతా నవ్యంకాదు. నవ్యం కానిది కావ్యమే కాదు. కాబట్టి నవ్యతకన్నా, నవ్యతముఖ్యమని కవి భావమేమో ! ఈ నవ్యదృష్టి అలవడినవాడే పాక్షికమైన నేటి కవిపండితలోకానికి సంప్రదాయ కవితపట్ల ఉన్న అపోహతొలగి—అక్కడ అనురణితమైన "అభ్యుదయ స్వరూపం" అవగతమౌతుంది.

ఏ కావ్యంలోనైనా వస్తువరణం కవి చిత్త సంస్కారాన్ని పట్టి ఇస్తుంది. వస్తు విన్యాసం కవి మనోవికారాన్ని ప్రదర్శిస్తుంది. ఆ రెండూ కలిస్తేనే కావ్యం సహృదయ లోకానికి ప్రకటితమౌతుంది.

'చరితార్థమైనట్టి జన్మముగోరి
వరగాథ నీ రీతి వర్ణింపగోరి' పుట 52.

విమర్శకులుగా విశ్రుతులైన డా. యం. కులశేఖర రావు గారు వెలయించిన 'శ్రీకృష్ణ చరిత్ర' లోని వస్తు విన్యాసం సత్సంప్రదాయ సంపద్భరితమై; సహృదయామోద మహితమై ఉన్నది.

R. Vasu Nandan,
M.A , M.Phil.
Core Faculty Member,
Institute of Correspondence Courses
Osmania University, Hyderabad.




# శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల స్వర్ణోత్సవ మహాసభలు

-రచన : శ్రీ బత్తుల వేంకట రామరెడ్డి, జర్నలిస్టు, గుత్తి

రాయలసీమలో ఏబది సంవత్సరాలపైగా సాహిత్య సేవచేస్తూ పండిత ప్రశంస లందుకొన్న శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల స్వర్ణోత్సవ మ హా స భ లు హిందూపురం పట్టణంలో వాసవీ ధర్మశాల యందు జనవరి 21, 22, 23 తేదీలలో మూడు రోజులపాటు అతి వైభవోపేతంగా జరిగినవి.

ఆంధ్ర దేశంలోని నలుమూలలనుండి పెక్కుమంది కవులు, పండితులు, రచయితలు, రచయిత్రులు, సాహిత్యాభిమానులు పాల్గొన్న ఈ స్వర్ణోత్సవ సభలో పగటి వేళల సారస్వత గోష్ఠులు, రాత్రి వేళల కళా ప్రదర్శనలు ఉత్తేజకరంగా ఉత్సాహభరితంగా జరిగాయి.

21వ తేది శుక్రవారం సాయంత్రం 6 గంటలకు హిందూపురం నరహరి సద్గురు ఆశ్రమ పీఠాధిపతులు, బ్రహ్మశ్రీ సింహాద్రి స్వాములు వేద పఠనంతో మహా సభలను ప్రారంభిస్తూ మహోన్నతమైన ఆధ్యాత్మికోపన్యాసం గావించారు.

హిందూపురం ఎన్.టి.జి.యస్. కళాశాల ప్రిన్స్‌పాల్ శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారు సభకు అధ్యక్షత వహిస్తూ శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల చేసిన సేవలను, ప్రస్తుతం జరుగుతున్న ఉత్సవాల నిర్వహణను కొనియాడారు.

శ్రీకృష్ణ దేవరాయల యూనివర్సిటి తెలుగు రీడర్ డా॥ శలాక రఘునాథశర్మ శ్రీకృష్ణ దేవరాయల సాహిత్యపోషణ, అన్న అంశంపై ప్రసంగిస్తూ అనంతమైన ప్రాచీన సాహిత్యం ఆయన కాలంలోనే మనకు లభ్యమయినదని, కవి పోషకుడేకాక స్వయంగా కవియై ఆంధ్ర భోజునిగా కీర్తింపబడిన శ్రీకృష్ణ దేవరాయలు ఆముక్త మాల్యదను తెలుగులో వ్రాస్తూ దేశ భాషలందు తెలుగు లెస్స అని కీర్తించాడని తెలుగు భాషావిశిష్టతను ఉగ్గడిస్తూ ఇది సజీవమైన భాష అని, సముద్రంలో సర్వ నదులు సంగమించి నట్లు అన్ని భాషలూ తెలుగులోచేరి పుష్టిని పొందాయని, తెలుగులో పరమోదాత్తమైన సాహిత్యం ఆంధ్ర భోజుని కాలంలోనే అవతరించిందని, వారు నారికేళ పాకంలో కావ్యం వ్రాశారని అందలి సొగసులను వివరించారు. అధ్యక్షులవారికి ఉపన్యాసకులకు సభా నిర్వాహకులు శాలువ కప్పి చందన తాంబూలాదులతో సత్కరించారు. తొలుత శ్రీ చేజ్ఞ్రాడు రామారావు స్వాగతంపలికి అతిథులను సభకు పరిచయం చేశారు. శ్రీ కె. జానకిరామ్ ప్రముఖుల సందేశాలను చదివి వినిపించారు.

మలుగూరు ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. తిప్పరాజు బృందం విరాటపర్వంలోని ఒక ఘట్టాన్ని తోలుబొమ్మలాటద్వారా ప్రదర్శించి, ప్రేక్షకుల

నలరించారు. గ్రంథమాల కార్యదర్శి శ్రీ కల్లూరు రాఘవేంద్రరావు వందన సమర్పణతో తొలి రోజు కార్యక్రమాలు ముగిశాయి.

## రాయలసీమ జానపద సాహిత్యగోష్ఠి

22వ తేది శనివారం ఉదయం 10 గంటలకు ప్రారంభమైన రాయలసీమ జానపద సాహిత్యగోష్ఠికి వినోద రత్నాకర శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్‌గారు అధ్యక్షత వహించారు. శ్రీ సి. రామారావు స్వాగతం పలికారు. శ్రీ కల్లూరి జానకిరామ్‌గారి ప్రార్థనా గీతంతో సభ ప్రారంభమయింది. శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి సభాధ్యక్షులను ఉపన్యాసకులను పరిచయం గావించారు.

శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్ తన అధ్యక్షోపన్యాసంలో హిందూపురంలో ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలు జరిగిన ఉదంతాన్ని ప్రస్తావించి, అంత భారీఎత్తున ఈనాడు శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల స్వర్ణోత్సవ కమిటీవారు సాహిత్య సభలు జరుపుట ముదావహమన్నారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని బళ్ళారిలో 1931 లో స్థాపించబడిన ఈ సంస్థ ఏబది సంవత్సరాలపాటు అవిచ్ఛినంగా సాహిత్య సేవ చేస్తూవస్తున్నందుకు సంస్థ నిర్వాహకులు శ్రీ కల్లూరు అహోబలరావు కృషిని ఆయన అభినందించారు. సంస్థ స్వర్ణోత్సవాల సందర్భంగా ఈయనకు ఆయన ఎంతో మందికి సన్మానం చేస్తున్నారని, దీనికి కారకులైన హిందూపురం వాస్తవ్యులను ఆయన అభినందించారు. సంపన్నులు ఎంతోమంది వుండవచ్చు కాని, ఆ సంపదను సద్వినియోగం చేసినపుడే అది రాణిస్తుందని ఒక మంచికార్యానికి సాయపడినందుకు ఈ పట్టణవర్తకులు చరితార్థులైనారన్నారు. జానపదసాహిత్య ఆవిర్భావాన్ని వివరిస్తూ మానవులు తల్లిగర్భంలో విలీనమవుతున్నట్లు అన్ని పాటలు జానపదగేయాలలోనే పుట్టాయని ప్రాచీన సాహిత్యానికి వున్న గౌరవం జానపద సాహిత్యానికి వుందంటూ పాశ్చాత్యుల్లో బ్రౌన్‌దొర జానపద సాహిత్యానికి ఎంతో సేవ చేశారని, జానపద సాహిత్యంలో సాహితులు, జానపద కథలు, పాటలు చేరి వున్నాయని, ఇప్పటికే ఎంతో జానపద సాహిత్యాన్ని మనం కోల్పోయామని, దీని పురరుద్ధరణకు పూనుకోవలసిన ఆవశ్యకత ఎంతైన వున్నదన్నారు. పల్లెప్రాంతాలలో బిచ్చగాళ్ళద్వారా జానపదగేయాలు వ్యాప్తి చెందుతున్నాయని, ఆ సాహిత్యాన్ని సంపాదించి భద్రపరిచేటందుకు కృషి జరగాలన్నారు.

జానపద కవికోకిల రాయలసీమ కథక చక్రవర్తి శ్రీ పులికంటి కృష్ణారెడ్డి ప్రసంగిస్తూ, మనిషి ఆనందాభిలాషి. సంస్కారాన్నిబట్టి ఆనందంకోసం అన్వేషిస్తున్నాడు. ఆ అన్వేషణ ఫలితమే జానపద సాహిత్య సృష్టి అన్నారు. జానపదులు పనిపాటులతో కలిగే తమ శ్రమనివారణార్థమై జానపదసాహిత్యాన్ని సృష్టించారంటూ, కొన్ని జానపద గీతికలనాలపించి, వాటి అర్థాన్ని వివరించారు. జానపద గీతికల పంథాలో, తాను రచించిన అమ్మ పాటలను కుమారి సహాయంతో జనరంజకంగా పాడి శ్రోతలనానందపరిచారు

శ్రీ ఆదిమూర్తి పులికంటి వారిని, శ్రీ సత్యనారాయణ గుప్త శ్రీ ఎ. గోపీనాథ్‌గారినీ శ్రీమతి కల్లూరి సీతమ్మ కుమారిని సన్మానించారు. శ్రీ కె. రాఘవేంద్రరావు వందన సమర్పణతో ఉదయకాల సభ ముగిసింది.

ఆనాటి సాయంత్రం జరిగిన యువకవి సమ్మేళనానికి కడపజిల్లా రచయితల సంఘం కార్యదర్శి శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి అధ్యక్షత వహించారు. శ్రీ కె జానకిరామ్‌గారు స్వాగతం పలికారు. సర్వశ్రీ తక్కెళ్ళ సుబ్బరత్నం, జి. రోషన్, గొల్లాపిన్ని విశాఖదత్తుడు, బండి ముత్యాలప్ప, జి. కె. సత్యనారాయణరావు. కల్లూరు రాఘవేంద్రరావు, శ్రీమతి యం. వి. సరస్వతి, జి. రామకృష్ణారెడ్డి, పి.యస్. మూర్తి, వావిలాల రజనీకాంత శర్మ, కుమారి సి.

వత్సల ప్రభృతులు కవిసమ్మేళనంలో పాల్గొని, తమ తమ కవితలను వినిపించారు. శ్రీ సజ్జాజు లక్ష్మీనరసింహరావు ఆయా కవుల కవితలను సమీక్షించి జనరంజకముగా వ్యాఖ్యానించారు

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి తన అధ్యక్షోపన్యాసంలో నేటి యువతరం ఎక్కువ చదువుకుంటేనే రచనలు చేయటానికి సాహసిస్తున్నందున అంతగా మంచి రచనలు రావటంలేదని, ప్రాచీన కావ్యాలను. ఆధునిక కవుల మంచి రచనలను ఎక్కువగా చదివి, భాషమీద, భావాలమీద అధికారాన్ని సంపాదించటానికి యువత కృషిచేసిన నాడు ఇంకా మంచిరచనలు రాగలవన్నారు.

నేటి పత్రికల పక్షపాతవైఖరిని అయన నిశితంగా విమర్శిస్తూ రాయలసీమకు ప్రత్యేకంగా పత్రికలు లేని కొరత కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నదని, ప్రస్తుతం పచారంలో వున్న ప్రముఖ పత్రికలు రాయలసీమ ఎడిషన్ అను పేరుతో ద్రవ్యార్జన చేస్తున్నవే కాని, రాయలసీమ రచయితలకు ప్రోత్సాహం ఇవ్వటంలేదనీ ఈ ప్రాంత రచయితలు తమ సంఘాల ద్వారా పత్రికలలో రాయలసీమ రచయితలకు తగిన అవకాశం కల్పించాలని ఒక ఉద్యమం చేపట్టాలన్నారు. మీ ప్రాంతమందలి రచయితలను. కళాకారులను గురించిన సమాచారం సేకరించి వారిని కలుసుకొని వారి తోడ్పాటు పొందవలసినదిగా యువరచయితలను ఆయన ఉద్బోధించారు.

శనివారం రాత్రి 8 గంటలకు శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి అధ్యక్షతన అష్టావధానం ప్రారంభమయింది. ద్రోణాచలం ఉన్నతపాఠశాల తెలుగు పండితులు శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మ అవధానం గావించారు. ప్రసిద్ధ పండితులు శ్రీ శలాక రఘునాథశర్మ (నిషిద్ధాక్షరి) శ్రీ యం. రామారావు (సమస్య) శ్రీ జి. రోషన్ (పురాణ పఠనము) శ్రీ శేషశర్మ (దత్తపది) శ్రీ జి. వి. సుబ్రమణ్యం (వర్ణన), శ్రీ చెంచు సుబ్బయ్య (ఆశువు) శ్రీ నాగేశ్వరశాస్త్రి (వ్యస్తాక్షరి) శ్రీ అమ్మళ్ళదిన్నె గోపీనాథ్ (అప్రస్తుత ప్రసంగము) పృచ్ఛకులుగా వ్యవహరించారు. అష్టావధానిని పృచ్ఛకులను సన్మానించడంతో ఆనాటి సభ ముగిసింది.

## రాయలసీమ రచయిత్రుల సభ

23 వ తేది ఆదివారం ఉదయం 10 గంటలకు జరిగిన రాయలసీమ రచయిత్రుల సమావేశమునకు అనంతపురం సత్యసాయి కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి డా॥ జి. హేమలత అధ్యక్షత వహించారు. ఆమె తన ప్రసంగంలో మనిషిలో చైతన్యాన్ని జ్ఞానదీప్తిని కలిగించే సాహిత్యం రావాలని, రచయితలు యుక్తాయుక్త వివక్షతను ఉపయోగించి, సమాజానికి ఏది మంచి, ఏది చెడుఅని ఆలోచించి తుచ్ఛమైన ఆనందం కోసం కాకుండా మంచితో మానవత్వాన్ని పెంపొందించే రచనలు చేయాలి అన్నారు. ప్రముఖ తెలుగు నవలా రచయిత్రి శ్రీమతి టి. విజయలక్ష్మి కథనవలా రెండింటికి తులనాత్మకమైన పరిశీలన చేసి చూపిస్తూ లోకములో వున్న పరిస్థితులలో మార్పు రావాలని విప్లవమనేది మానవుల మనస్తత్త్వంలో మార్పువల్ల కాని, కథలవల్ల రాదు అన్నారు. పాఠకులు ఏ విధమైన సాహిత్యానికి ఇష్టపడుదురో ఆ విధమైన సాహిత్యాన్నే సృష్టించాలన్నారు. రచనల్లో సామాజిక స్పృహ ప్రతిబింబించాలని సాంఘిక సహజీవనం ఉన్నత భావాల ఆశయం అవసరమన్నారు. ప్రముఖ కవయిత్రి శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి నేటి సాహిత్యంలో రచయితల పాత్ర అన్న అంశంపై ప్రసంగిస్తూ సమాజంలో స్త్రీల విషయంలో ప్రాచీన కాలంనుండి ఈ నాటివరకు వచ్చిన మార్పులను విశదీకరించారు. మనిషిలోని ఉద్రేకాలను తాత్కాలికంగా రెచ్చగొట్టకూడదని. పరిణత బుద్ధితో ఆలోచన చేసి ప్రతివ్యక్తి ఆత్మసాక్షితో రచన చేస్తే అది ప్రయోజనాన్ని సాధిస్తుందని, మనిషిలో చైతన్యాన్ని జ్ఞాన

దీప్తిని కలిగించే సాహిత్యం రావాలనే అధ్యక్షురాలి మాటలతో ఏకీభవించారు. శ్రీ కల్లూరు రాఘవేంద్ర రావు వందన సమర్పణతో నాటి ఉదయపు సమావేశం ముగిసింది.

## తెలుగు కథాసాహిత్య వేదిక

సాయంకాలం ఆ గంటలకు వాసవీ ధర్మశాలలోని సాహిత్య వేదిక అలంకార శోభతో సాక్షాత్కరించింది. అధ్యక్షులు శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డిగారు వక్తలు శ్రీ మధురాంతకం రాజారాంగారు,శ్రీ జె. ఎస్. మూర్తి (విహారి)గారు.

యథాపూర్వకముగా శ్రీ కల్లూరు రాఘవేంద్రరావు స్వాగతవాణి, శ్రీ వాసుదేవమూర్తి పరిచయ వచనాలు ప్రవర్తిల్లిన పిమ్మట, శ్రీ మల్లెమాల ప్రసంగిస్తూ మొదట కేవలం కాలక్షేపానికి అటుతరువాత నీతి బోధకు మానవుడు కథను ఉపయోగించుకొన్నాడని, అది అనేక పరిణామాలు పొందుతూ సాంఘికస్పృహ కలిగి సంఘాన్ని తీర్చిదిద్దేదిగా తయారైనది అన్నారు. పుట్టగానే ప్రౌఢగా తయారయింది. తెలుగు కథానిక అంటూ స్వాతంత్ర్యానంతరం పత్రికలు పెరిగాయి పాఠకులు పెరిగినందున కథకు బహుళ ప్రచారం లభించిందని, కథకులు విపరీతంగా పెరిగి కథల రాశి పెరిగింది కాని వాసి పెరగలేదని, మన కథా సాహిత్యంలో పట్టుమని పదికథలు కూడా వాసిలో రాణించడంలేదన్నారు. మొదటినుంచి మానవతావిలువలు కాపాడుకుంటూ, సామాజిక స్పృహ కలిగిన కథలు కొంతకాలం మనగలుగుతాయని కాలం విలువను గమనించి మనిషి మినీకథవైపు మొగ్గాడని కథకులలో అవగాహన పెరిగి, కాలంవిలువను గమనించి కథలు వ్రాయాలని, మేధావులైన సాహితీవేత్తలు సమాజాన్ని పైకి తీసుకురావటానికి ఉద్దీపన చేయటానికి తమ రచనలద్వారా కృషి చేయాలన్నారు.

శ్రీ విహారి తన ప్రసంగంలో తెలుగు కథకు రాసి వున్నది కాని వాసి లేదన్నది ఒక అపప్రథ అని తెలుగుకథానికలలో ఇతివృత్తంలో శిల్పంలో శైలిలో వస్తున్న మార్పులు అనేకం అంటూ ఉదాహరణలతో వివరించారు. తెలుగు కథా సాహిత్యంలో ఆణిముత్యాలవంటి కథలు వస్తున్నవనీ తెలుగు కథ ప్రపంచ కథా సాహిత్యంలో స్థానం సంపాదించుకొన్నదని కథ జనసామాన్యం అందుబాటులోనికి వచ్చేటట్లు వారిలో పరివర్తన తెచ్చేటట్లు వుండాలన్నారు. రచయిత పరిష్కారం ప్రత్యక్షంగా చూపించకుండా పరోక్షంగా చూపించాలన్నారు. ఊరూరా సాహిత్య సంఘాలతోపాటు పాఠకుల సంఘాలు ఏర్పడాలి. అవి కథలయొక్క బాగోగులనుచర్చిస్తూ రచయితలకు సలహాలు ఇస్తుండాలి అన్నారు ఆయన.

శ్రీ మధురాంతకం రాజారాం, తన ప్రసంగంలో కథానిక అనే సాహిత్య ప్రక్రియ మానవ నాగరికత ఎంత పాతదో అంత పాతదని కథలు చెప్పేవారి కల్పనా శక్తినిబట్టి, వినేవారి కుతూహలాన్ని బట్టి కొద్ది కాలంలోనే ముగియాలని, కథ ముగింపులో పాఠకులు ఆహా! యని ఆశ్చర్యాన్నిగాని, అయ్యో! అని విచారాన్ని తెలిపేవిగా వుండాలని ఆయన అంటూ, పాఠకుల హృదయాలను ఆకట్టుకునే స్థానాన్ని కథ పొందాలన్నారు. దీనజనుల హృదయ విదారక గాధలను కథానికలు ప్రతిబింబించాలని మంచి చెడుల పదును లేక మానవుని వైచిత్రి మన కథానికలో కనిపించాలన్నారు. రాశి పెరిగినప్పుడు వాసి తగ్గడం సహజమని అయినా కథానికా రచనలో మనమెవ్వరికి తీసిపోము అన్నారు. కథానికా సాహిత్యంలో జిల్లా స్థాయిలో వర్కుషాపులు ప్రారంభించాలని ఆయన అన్నారు.

అధ్యక్షులను వక్తలను స్వర్ణోత్సవ కమిటీవారు నూతన వస్త్రాలతో సత్కరించారు.

అనంతరం స్వర్ణోత్సవ ప్రత్యేక సంచిక స్వర్ణోత్సవ రథాన్ని శ్రీ ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ ఆవిష్కరించారు. ఆ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ

గత వైభవాన్ని చాటుకోవాలంటే మనకు మిగిలినవి ప్రాచీన కావ్యాలే అన్నారు. శ్రీకృష్ణ దేవరాయ గ్రంథ మాల సాధించిన విజయాలను ఆయన కొనియాడేరు. రాజకీయాల అండదండలు లేకుండా ఏబది ఏండ్లు మన గలిగినదంటే దీని నిర్వాహకుల మొక్కవోని ధైర్యము, పట్టుదల కనిపిస్తాయి అన్నారు స్వర్ణోత్సవ రథ సంచికను సమీక్షిస్తూ తెలుగు భాషా సంస్కృతు లను గురించిన రచనలు ప్రచురించబడినాయని తెలియ జేశారు. ఈ సంస్థకు ఆర్థిక సహాయంతోపాటు హార్థిక సాయం అందచేయాలి అని ఆయన కోరారు. రాయల నాటి వైభవాన్ని సాహిత్య ఘోషణను ఈ సందర్భంగా ఆయన గుర్తుచేశారు.

సభకు హాజరైనవారిని శ్రీ కల్లూరు అహోబల రావు అభినందించారు. శ్రీ కల్లూరు ఆహోబలరావు గారిని పలు సంస్థలు సన్మానించాయి. శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డి ఆయనను సన్మానించి రు 516 లు విరాళం ప్రకటించారు. అనంతపురం జిల్లా రచయితల సంఘం తరపున శ్రీ ఆమళ్ళదిన్నె గోపీనాథ్ కడప జిల్లా రచయితల సంఘం తరపున కార్యదర్శి శ్రీ జాన మద్ది హనుమచ్ఛాస్త్రి, చిత్తూరు జిల్లా రచయితల తర పున శ్రీ మధురాంతకం రాజారాం, నెల్లూరు జిల్లా రచయితల తరపున శ్రీమతి పర్వతవర్ధిని రామశేషు, కర్నూలు జిల్లా రచయితల తరపున శ్రీ వేణుగోపాల్, ప్రభృతులు శ్రీ కల్లూరు ఆహోబలరావుగారికి నూతన వస్త్రాలు, బహూకరించి సన్మానించారు. శ్రీ కల్లూరి సహచరులు శ్రీ బాబన్న యాదవనుకూడా ఈ సంద ర్భంలో సన్మానించారు.

రాత్రి 10 గంటలకు కవిపండితుల వీడ్కోలు సమారంభంలో అధ్యక్షులు శ్రీ దశరథరామయ్య, డాక్టర్ ఎం. ఎల్. నరసింహారావు ప్రభృతులను సన్మానించారు. అధ్యక్షులను వక్తలను నూతన వస్త్రా లతో ఆయన సత్కరించారు. శ్రీ గొల్లాపిన్ని వాసు దేవశాస్త్రి మంగళాశీస్సులతో ఆ సభ సమాప్త మయింది. అనంతరం లేపాక్షి శ్రీ కె. తిప్పరాజు బృందం ద్రౌపది వస్త్రాపహరణం, యక్షగానం శ్రీ కేశవరావు అధ్వర్యంలో నృత్య ప్రదర్శనలు జరిగాయి.

ఈ స్వర్ణోత్సవాలకు సర్వవిధాల సహాయంచేసిన ఎల్లరకు శ్రీ కల్లూరు రాఘవేంద్రరావుగారు తమ కృతజ్ఞతాభివందనములు తెలుపుతూ ముఖ్యంగా సభ లకు వచ్చినవారికి భోజన సదుపాయములు సంతృప్తి కరంగా ఏర్పాటు చేసిన దాతలకు కృతజ్ఞతలు చెప్పిన తరువాత ఉత్సవ కార్యక్రమం సలక్షణంగా ముగిసింది.

మూడు రోజులపాటు జరిగిన గ్రంథమాల స్వర్ణో త్సవాలను విశేష సంఖ్యలో ప్రజలు హాజరై తిలకించి ఆనందించారు.



